# గ్రామరాజ్య పాఠాలు

గోరా



తొలి ముద్రణ

ఆగస్టు, 1957

ప్రతులు : 1000

వెల : నాలుగు అణాలు

ప్రతులకు:—

'ఆర్థిక సమత'

పటమట :: కృష్ణాజిల్లా

# ముందుమాట

ప్రస్తుత పుస్తకం 'గ్రామరాజ్య పాఠాలు' ముఖ్యంగా కార్యకర్తల కొరకు రచింపబడింది. భూదాన ఉద్యమము చివరకు గ్రామరాజ్య స్థాపనగానే పరిణమించవలసి యున్నది. అట్టి సమయంలో గ్రామరాజ్య స్థాపన గురించి కార్యకర్తలు వివిధ విషయాలు తెలుసుకొనుట అవసరం. చైతన్య యుతమైన కార్యకర్తలవల్లనే ఉద్యమం సజీవ స్రవంతివలె ముందుకు సాగుతూ ఉంటుంది. ఎప్పటికప్పుడు గతాన్ని, వర్తమానాన్ని సింహావలోకనము చేసుకొని భవిష్యత్తుకు కార్యక్రమాలను నిర్ణయించుకొనుట కార్యకర్త లక్షణము.

గ్రామరాజ్య వ్యవస్థయందే స్వరాజ్యం సరియైన స్వరాజ్యం కాగలదని గాంధీ మహాత్ముడు చెప్పారు. అయినా తీరా స్వరాజ్యం వచ్చిన తరువాత గాంధీజీ హత్యతో మనం గ్రామరాజ్యానికై జరుపవలసిన కృషిని మరచిపోయామా అన్నట్లయింది. అలాంటప్పుడు గాంధీజీ అనుయాయుల్లో గ్రామరాజ్యం గురించి నాటి నుండీ కూడ పదే పదే చెబుతూవచ్చింది గోరా గారు (గోపరాజు రామచంద్రరావుగారు) అనడం యదార్థ సత్యం. గ్రామ రాజ్యం కావాలని నేడు దరిదాపు అందరూ అంటున్నారు. ముఖ్యముగా భూదానం గ్రామదాన రూపం తీసుకున్న తరువాత గ్రామదాన గ్రామాలలో నూతన సమాజ వ్యవస్థా నిర్మాణం సమస్య వచ్చినప్పటినుంచీ గ్రామ రాజ్యం గురించి చాలా మంది ఆలోచించుట ఎక్కువైంది. కాని 1949 నుండే గోరాగారు తమ 'సంఘం' పత్రికలో సమాజాన్నెదుర్కొనే క్లిష్ట సమస్యలు పరిష్కారం కావాలంటే వ్యక్తిగత ఆస్తి నిర్మూలన, గ్రామ రాజ్య స్థాపన అవసరమని గట్టిగా వాదించారు. ఆనాడు దేశంలో ఈ విషయమై అంత గట్టిగా చెప్పిన వ్యక్తి మరొకరు లేరు. 1951 మార్చి 3, 4 తేదీలలో గుడివాడ (కృష్ణాజిల్లా) లో జరిగిన గాంధీసంఘం మహాసభలకు అధ్యక్షత వహించినపుడు గోరాగారు తమ ఉపన్యాసంలో సగభాగం

గ్రామరాజ్యమను విషయానికే వెచ్చించారు, అంతేకాక గత రెండు సంవత్సరాలుగా ఇతర ప్రాంతాలలోకూడా చాలా సభలలోనూ, శిబిరాలలోనూ గోరాగారు ఈ విషయాన్నే చర్చించారు. వీటినిబట్టే గోరాగారి పేరే *G. R.* (జి. ఆర్.) అంటే *Gram Raj* (గ్రామరాజ్యం) అనే వాడుకకూడా ఏర్పడింది!

గోరాగారు గ్రామరాజ్యం గురించి చెప్పటయే కాదు, తన జీవితాన్ని కూడా ఆ విధానానికి అనుగుణంగా మలచుకున్నారు. కనుకనే దేశములో గ్రామరాజ్యమనే విషయానికి ప్రాముఖ్యత వచ్చినప్పుడు అందరి దృష్టీ ఆయనపై బడుట సహజం. సర్వసేవాసంఘం ప్రచురణలవారు గోరాగారిని గ్రామరాజ్యంపై ఒక పుస్తకాన్ని రచించి ఇమ్మని కోరారు. అది ఇంగ్లీషులోనూ, భారతదేశంలోని అన్ని భాషలలోనూ ప్రచురింపబడగలదు.

అయితే ఈలోగా ఆంధ్రదేశమంతటా గ్రామరాజ్య శిక్షణశిబిరములు నడపవలెనని నిశ్చయించాము. అందు తొలిగా రాష్ట్రశిబిరం ('57) జూన్ మాసాంతమున భీమవరంలో జరిగింది. ఆ శిబిరంలో గోరాగారు గ్రామరాజ్యం విషయమై ఇచ్చిన ఉపన్యాసములు కార్యకర్తలను ఆలోచింపచేయుటే కాక వారికి నూతనశక్తినీ, నూతన స్ఫూర్తినీ కలిగించినవి.

భీమవరంలో శిక్షణ పొందిన వారిలో శ్రీ సాగిగడ్డి వెంకటేశ్వరరావు ఒకరు తన కాలేజీ విద్యను ఈ సంవత్సరమే ముగించుకున్న యువకుడు. ఆంధ్రదేశంలో గ్రామరాజ్య శిక్షణ శిబిరములను నిర్వహించుట యందు తోడ్పడుటకు ముందుకు వచ్చారు. భీమవరం ఉపన్యాసములను పుస్తకరూపంలో కూర్చుటకు గోరాగారితో సహకరించారు. ఈ పుస్తకం ప్రచురింపబడుటకు శ్రీ చింతలపాటి వరప్రసాద మూర్తిరాజు గారి ప్రోత్సాహమే ముఖ్యకారణము.

గ్రామరాజ్య ప్రచారమునకుగాను ఆంధ్రదేశంలో నడపబడు శిబిరాలలో కార్యకర్తలకు పాఠాలుగా ఉపయోగపడు దృష్టితోనే ఈపుస్తకము ప్రచురింపబడుచున్నది. గ్రామరాజ్యము యొక్క సిద్ధాంతము విధానము గోరాగారు ఇంగ్లీషులో వ్రాయుచున్న పుస్తకములో విపులముగా

చర్చించబడగలవు. ఆ పుస్తకము వెలువడేలోగా శిబిరముల నిర్వహణకు ఇది సహాయకారి కాగలదు.

పూజ్య వినోబాజీ 57 ఏప్రిల్ 15వ తేదీన కన్యాకుమారి అగ్రం వద్ద, దేశంలో గ్రామరాజ్య స్థాపన జరిగే వరకూ తాను పదయాత్ర కొనసాగిస్తూనే ఉంటానని ప్రతిజ్ఞ చేశారు. కనుక కార్యకర్తలందరూ గ్రామ రాజ్యం గురించి స్పష్టంగా తెలుసుకొని ఆ దిశను ఉద్యమం పురోగమించునట్లు చేయవలసి యున్నది.

కార్యకర్తలే కాక, ఈ విషయమందు కుతూహలముగల వారందరూ లోతుగా అధ్యయనము చేయవలసిన పుస్తకమిది. పుస్తకము యొక్క విశిష్టతను పాఠకులే స్వయంగా తెలుసుకొనగలరు కనుక, ఈ కొద్దివాక్యములతో నా ముందుమాటను ముగిస్తున్నాను.

హైదరాబాదు : ప్రభాకర్
31 జూలై 1957 : ఆంధ్రప్రదేశ్ భూదాన సేవక్

# I

# నాగరికత లక్షణములు

••••••••••••

## సౌఖ్యము

మానవుని సౌఖ్యానికి ఆహారము, స్వేచ్ఛ ఈ రెండూ ముఖ్య అవసరములు. ఆహారమనగా దేహాన్ని పోషించే అవసరాలు. కూడు, గుడ్డ, నీడ, వైద్యము- ఇవన్నియు ఆహారము క్రిందకివస్తాయి. ఆహారముంటేనేతప్ప మనిషి అసలు జీవించనే లేడు. కాని మానవ జీవితం ఆహారంతో సరిపోదు. స్వేచ్ఛ కూడా కావాలి. స్వేచ్ఛ అనగా ఎవరి కోరికల ప్రకారం వారు జీవితాన్ని నడుపుకొనుట మానవ జీవితానికి, పశుజీవితానికి ముఖ్యమైన తేడా స్వేచ్ఛను అనుభవించుటలోనే ఉంది. పశువులకు, మానవులకుకూడ శరీరపోషణకు ఆహారము కావాలి. కాని స్వేచ్ఛను మానవుడు కోరినంతగా పశువులలో లేదు. అందుచేత స్వేచ్ఛను అనుభవించుట మానవ జీవితముయొక్క ప్రత్యేక లక్షణం.

జీవితానికి కావలసిన ఆహారమును సంపాదించుకొని కొంత స్వేచ్ఛనుకూడ అనుభవించడానికి మానవునియొక్క శక్తిసామర్థ్యములు సరిపోతవి. తన తెలివితేటల వల్ల జంతువులకంటె సులభంగానే మానవుడు ఆహారమును సంపాదించుకొనగలడు. కాని మానవుడు అంతటితో సంతృప్తి పడడు. తన

యొక్క ఊహాజ్ఞానము వలన ఎప్పుడూకూడా తన కోర్కెలను పెంచుకుంటాడు. కొంత ఆహారము లభిస్తే అంతకంటే రుచి కరమైన ఆహారము కావాలని కోరుతూ ఉంటాడు. ప్రతి విష యములోను ఇంతే. ఎంత సౌఖ్యమున్నా దానితో సంతృప్తి చెందక ఇంకా సౌఖ్యం కావాలని కోరుతూ ఉంటాడు. ఇట్లు కోరికలను పెంచుకుంటూ వాటిని నెరవేర్చుకొనుటకు ప్రయ త్నించుటే మానవ నాగరికత. అనగా నాగరికత గల మాన వుడు నిరంతరము సౌఖ్యమునుండి అధిక సౌఖ్యానికి పురోగ మిస్తూ ఉంటాడు.

## సౌ ఖ్య సా ధ న ము లు

ఒక వ్యక్తి యొక్క శక్తి సామర్థ్యాలు ఆహారాన్ని, స్వేచ్ఛను కొంతవరకు సంపాదించుకోవటానికి సరిపోతవి. ఎప్పటి కప్పుడు ఇంకా అధిక సౌఖ్యాన్ని సంపాదించుకోవాలంటే మాన వుడు తన శక్తి సామర్థ్యాలను కూడా అధికము చేసుకుంటూ ఉండాలి కదా? అందుచేత మానవుడు తన శక్తి యుక్తులను రెండు విధాలుగా పెంచుకుంటూ వచ్చాడు — (1) పనిముట్ల ద్వారాను, (2) సంఘ నిర్మాణం ద్వారాను.

## ప ని ము ట్లు

కోతి ఒక కాయను పగులకొట్టాలంటే దానిని తన పళ్లతో కొరుకుతుంది. కాని మానవుడు ఒకొక్కప్పుడు కొరి కోరికినా, సాధారణంగా రాయి పెట్టి కొట్టి ఆకాయలు పగుల గొట్టుతాడు. అనగా కాయను పగులకొట్టుటకు ఒక రాయిని

మానవుడు పనిముట్టుగా ఉపయోగిస్తాడు.

పనిముట్లు రూపము అంతకంతకు అభివృద్ధి పొంది సుత్తిగాను, కత్తిగాను, పెద్ద పెద్ద యంత్రములుగా కూడా వృద్ధి పొందింది. పనిముట్టు ఏదైనప్పటికీ, పనిముట్టును తయారు చేసుకొనుట, దానిని ఉపయోగించుట వలన మానవశక్తి పెరిగింది. ఈ రోజున ఆవిరితోను, పెట్రోలుతోను, ఎలెక్ట్రిసిటీతోను, అణుశక్తితో కూడ యంత్రాలు నడుపుతూ మానవుడు తన కార్యసాధన శక్తిని అత్యధికముగా పెంచుకుంటున్నాడు. ఇట్లు పనిముట్టును ఉపయోగించుకొనుట నాగరికత యొక్క లక్షణం. పనిముట్ల ఉపయోగమువలన మానవుని శక్తి పెరిగినదనుటలో సందేహము లేదు.

## సంఘము

మానవ శక్తిని పెంచుకొనుటకు రెండవ సాధనము సంఘ నిర్మాణం. సంఘమనగా కొందరు మనుష్యులు కలసి మెలసి సహకరించుకొనుచూ పనిచేయుట. సంఘ నిర్మాణము వలన పది మంది భుజబలము కలసి పశుబలము పెరుగుతుంది. ఉదాహరణకు పది మంది సహాయముపట్టి ఒక బరువును లేపి వేయగలరు. సంఘ నిర్మాణము వలన ఒక వైపు ఇట్లు పశుబలము పెరిగినప్పటికి, దాని ముఖ్యోపయోగము పశుబలము పెరుగుట కాదు. పశుబలమును పనిముట్ల ద్వారా మనిషి ఎన్నో రెట్లు పెంచుకొనగలడు. కొన్ని వందల మంది మనుష్యులు కూడ ఎత్తలేని బరువు పనులను యంత్రములను నడుపుట ద్వారా కొద్ది మంది మనుష్యులు సాధించగలరు. అందు

చేత సమాజ నిర్మాణము ద్వారా మానవునికి వచ్చిన లాభము పశుబలాభివృద్ధి కాదు; అది సమాలోచనలలోఉన్నది. అనగా ఒక్కడు ఆలోచించటం కంటే పది మంది కలసి ఆలోచించుట చేత ఊహలు పెరిగి, కార్యసాధనకు ప్లానులు వేయవచ్చు. ఇట్లు యంత్ర నిర్మాణం ద్వారా మానవుని పశుబలము పెరుగుతూ ఉంటే సంఘ నిర్మాణం ద్వారా మానవుని ఆలోచన శక్తి పెరుగుతూ ఉంది.

యంత్రములూ, సమాజమూ ఒకదానికొకటి సహాకరించుకుంటూ పరస్పరము వృద్ధి పొందగలిగినవి. బండ్లు, రైళ్ళు, విమానములు, టెలిఫోనులు, రేడియోలు మొదలగు పనిముట్లవలనమూలమూలల ఉన్న ప్రజ సంప్రదించుకొనుచూ, సహాకరించుకొనుచూ సమాజసంఖ్యను విరివిగాను, విశాలముగాను పెంచుకుంటున్నారు. అలాగే మూలల ఉన్న వైజ్ఞానికులు పరస్పర సంప్రదింపుల ద్వారా రకరకాల యంత్రాలను గూడ వృద్ధి చేయగలుగుచున్నారు. ఇట్లు యంత్రముల వలన సమాజము, సమాజము వలన యంత్రములు అభివృద్ధి పొందుతూ మానవుని శక్తిసామర్థ్యములను అత్యధికంగా అభివృద్ధి చేసినవి. ట్రాక్టర్ల వ్యవసాయము వలన, మిల్లు పరిశ్రమల వలన ఆహారమూ, సౌఖ్యాభివృద్ధికి కావలసిన సామాగ్రి ఎంతో ఉత్పత్తి అవుతున్నది. ప్రభుత్వ నిర్మాణము, నైతిక సూత్రములు, ఆర్థిక విధానముల వలన సమాజముకూడా కట్టుదిట్టములతో వృద్ధిపొందుచున్నది. ఇట్లు యంత్రములూ, సమాజమూ పెరుగుట వలన మానవుని శక్తిసామర్థ్యాలు అధికమై నాగరికత వృద్ధిపొందుచున్నది.

# 2

# ఈ నాగరికతలోని లోట్లు



యంత్రముల ద్వారాను, సమాజము ద్వారాను మానవుని శక్తిసామర్థ్యములు పెరుగుతున్నకొద్దీ వాని సౌఖ్యంకూడా పెరగవలెనుగదా. నిజానికి ఈనాడు కొద్దిమంది ఆహారసౌఖ్యాన్ని, స్వేచ్ఛా సౌఖ్యాన్ని అత్యద్భుతంగా అనుభవించుతున్నారు. వీరిని మనం ఈనాడు ధనికులంటాము. సమాజము మొత్తముమీద చూస్తే ఈ విధంగా సౌఖ్యమునను భవించేవారు బహుకొద్ది. కాని సామాన్య ప్రజానీకంలో ఆహారము లేక కొందరు, స్వేచ్ఛలేక కొందరు, ఈ రెండు లేక మరి కొందరు చాలా కష్టములపాలై యున్నారు.

## సోషలిజం

ఇప్పుడు మనం సోషలిస్టువిధానం అనుకునే రష్యావంటి దేశాలలో ప్రజలందరకు ఆహారము చాలా వరకు ఉన్నది. కాని అక్కడ ప్రజయొక్క స్వేచ్ఛను ఆ ప్రభుత్వ విధానము అరికట్టుచున్నది. ప్రజలకు ఆహారము ఉండవలెనంటే ప్రభుత్వము నియంతృత్వాధికారమును పొంది, ప్రజలను నిర్బంధించి అయినా వారిని ఒక జీవిత విధానములో నొక్కిపెట్టవలెనను నది సోషలిస్టు విధానము యొక్క మూలసూత్రము. కాబట్టి అక్కడి ప్రజకు ఆహారముండుటచేత కొంత సంతృప్తి ఉన్నప్ప

టికీ, స్వేచ్ఛ కొరత అగుటచేత అసంతృప్తి చెంది ఆ విధాన ముపై తిరుగుబాటు చేస్తారు. కాని సోషలిస్టు, కమ్యూనిస్టు, ఫాసిస్టు ప్రభుత్వాలు నియంతృత్వములగుటచేత ప్రజలలోని స్వేచ్ఛా పోకడలను గట్టిగా అణచివేయ చూస్తాయి. స్వేచ్ఛా ఎన్నికలకు అవకాశముండదు. అందుచేత ప్రజలు రహస్యాన్ని అనుసరించి కుట్రలు పన్నుతూ ఉంటారు. ఇటూ అటూ హత్య లుంటాయి. ఇట్లు సోషలిస్టు విధానమందు ఆహార మున్నా, స్వేచ్ఛలేక అశాంతి ఉంటుంది.

### ప్రజాస్వామ్యము

నేడు ప్రజాస్వామ్యమనుకునే అమెరికా, ఇంగ్లండువంటి దేశాలలో ప్రజలకు చాలా స్వేచ్ఛ ఉన్నది. తమ ప్రభుత్వాన్ని నిరాక్షేపణగా విమర్శించుకోవచ్చు. ఎన్నికలలో ఎన్ని పార్టీలైనా పాల్గొంటాయి ప్రజలకు ఇంతస్వేచ్ఛ ఉన్నప్పటికి ఈ ప్రజాస్వామ్యాలలో అందరికి ఆహారము లేదు. వీటి ఆర్థికవిధానం ధనికతత్వము. విమర్శించుకొనుటకు ఎంత స్వేచ్ఛ ఉంటుందో ఒకరి నొకరు దోచుకొనుటకు కూడా అంత స్వేచ్ఛ ఉంటుంది, దోపిడీ విధానము వల్ల ఏర్పడిన ఆర్థిక అసమానతల వలన దారిద్ర్యం, మోసం, దౌర్జన్యం సరిపిగా ప్రబలి ఉంటాయి.

ఇప్పుడు అమలులో ఉన్న ఈ రెండు సామాజిక విధానములలోను. ఆహారమున్న చోట స్వేచ్ఛ లేదు; స్వేచ్ఛయున్న చోట ఆహారము లేదు. మానవ జీవితానికి కావలసిన ఆహారము, స్వేచ్ఛ రెండింటిలోను ఏదో ఒకటి కుంటుపడుతుం

చేత రెండు విధానాల్లోను ప్రజలలో అసంతృప్తి పెరుగు తుంది. కమ్యూనిస్టు వ్యవస్థలో స్వేచ్ఛ కొరకు ప్రజలు తిరుగు బాటు చేస్తే, ప్రజాస్వామ్య వ్యవస్థలో ఆహారం కొరకు తిరుగు బాటు చేస్తున్నారు. అందుచేత ఈ నాగరికత మొత్తం మీద సంతృప్తికరంగా లేదు. దేశంలో ప్రజలమధ్య కుట్రలు, దోపి డీలు, సమ్మెలు ప్రబలి ఉంటే, దేశ దేశాల మధ్య యుద్ధాలు చెలరేగుతున్నవి. ఈ నాగరికతలో లోటు ఎక్కడున్నదో గుర్తించి దానిని సరిదిద్దితేనే తప్ప పనిముట్లు, సమాజ నిర్మా ణము వలన మానవుడు ఆశించిన అధిక సౌఖ్యాన్ని పొంద లేడు.

# 3

# సక్రమ నాగరికత



## స్వాతంత్ర్యము

పనిముట్టయినా, సమాజమయినా వీటిని నిర్మించినది మానవుడే గదా. పనిముట్లు అంతకంతకు వృద్ధిపొంది పెద్దపెద్ద యంత్రములు కావచ్చు; సంఘముకూడా అంతకంతకు పెరిగి మతము, ప్రభుత్వమువంటి శాఖోపశాఖలుగా వ్యాప్తి కావచ్చు. అయినప్పటికి వీటి అన్నింటికి కర్త మానవుడే. తన సౌఖ్యాభి వృద్ధికి వీటిని నిర్మించుకుంటున్నాడు.

సౌఖ్యాభివృద్ధికి ఎంతమటుకు తోడ్పడితే అంతవరకు పనిముట్లను, సంఘాన్ని ఉపయోగించుకొనవచ్చు. ఎప్పుడు అవి

సరిపోవో అప్పుడు వాటిని మార్చివేయవచ్చు. కొత్త వాటిని నిర్మించుకోవచ్చు. అందుచేత ఈ యంత్రములకు, ఈ ప్రభుత్వానికి, ఈ ఆర్థిక విధానాలకు, ఈ నైతికసూత్రాలకు తానే అధిపతి అను చైతన్యం నాగరికత పొందుటకు అవసరం. ఇట్టి స్వాతంత్ర్య చైతన్యము మానవులలో ఎంత గట్టిగా ఉంటే, అంత సక్రమంగా నాగరికత నడుస్తూ, మానవుని సౌఖ్యాభివృద్ధి పొందుతూ ఉంటుంది.

### బానిసత్వము

కాని మానవులలో క్రోధము, ప్రేమ అను పరస్పర వైరుధ్య ప్రవృత్తులు కలసి ఉన్నట్లే, స్వాతంత్ర్యము, బానిసత్వము అను రెండు ప్రవృత్తులుకూడా కలసి ఉన్నవి. తాను అన్నింటికి అధికారిని అను ఆత్మవిశ్వాసము, ధైర్యము స్వాతంత్ర్య ప్రవృత్తి యొక్క లక్షణములు అయినట్లే, దేనికో ఒకదానికి లొంగిపడిఉండుట బానిసప్రవృత్తి యొక్క గుణము. మరియు బాధ్యతను చూచి బానిస భయపడతాడు. బాధ్యతల నుండి తప్పించుకోడానికి ప్రయత్నిస్తాడు.

నాగరికత ప్రాథమికదశలలో పనిముట్లూ, సమాజమూ విశేషముగా వృద్ధిపొందలేదు. కనుక ఎండ, గాలి, వాన వంటి ప్రకృతి రూపములను తెలిసికొని ఎదుర్కొన కలిగినంత విజ్ఞానమూ, శక్తీ ఆరోజులలో ఇంకా మానవునికి కలుగలేదు. అందుచేత వాటికి తాను లొంగిపోయి, తన బానిస ప్రవృత్తిని ప్రదర్శించుకొన్నాడు. తన జీవిత సిద్ధాంతములు ఆరోజులలో ఈ బానిసప్రవృత్తినే అనుసరించుతూ వచ్చాయి. ప్రకృతి

రూపములను అర్థము చేసుకొనుటకు ఒక సృష్టికర్తను తానే సృష్టించుకొని, దానికి తాను లొంగిపోయాడు. ఇది బానిస లక్షణం. నాగరికత ప్రాథమిక దశలలో ఏర్పడిన ఇట్టి సిద్ధాంతములు మానవుని అలవాట్లలో వ్రేళ్లు నాటుకుపోయినవి.

బానిసత్వంలోని బాధ్యతారాహిత్యమందు కొంత మన శ్శాంతి లభిస్తుంది ఈ విశ్రాంతిలో ఆలోచనా, విజ్ఞానమూ పెరుగుటకు అవకాశం కలుగుతుంది. పూర్వపు బానిసత్వ సిద్ధాంతాలు పరిశీలింపబడుతవి. ఈ మార్పుల వల్ల మానవ స్వభావములో ఇమిడియున్న స్వాతంత్ర్య ప్రవృత్తి కూడ కొద్దిగానో, గొప్పగానో వృద్ధి పొందుతుంది.

ఒకవైపున ఇట్లు స్వాతంత్ర్య ప్రవృత్తి పెరుగుచున్నప్పటికీ, నేడుకూడ అప్పుడప్పుడు బానిసప్రవృత్తిదే పై చెయ్యి. ఉదాహరణకు, పౌరుడే ప్రభుత్వాన్ని నిర్మించుకున్నాడు; కాని తనకంటె ప్రభుత్వమే బలమైనది అనుకుంటాడు. అలాగే తానే ఆటంబాంబును తయారు చేసుకున్నాడు; కాని దానికి ఈ రోజున తానే లొంగిపోతున్నాడు.

### మార్క్సిజము

ఆధునిక సిద్ధాంతమని పేరుపొందిన మార్క్సిజములో కూడ ఈ బానిస భావము గోచరిస్తుంది. ఆధునిక వైజ్ఞానికుల వలెనే మార్క్సు కూడా దైవము, పరలోకములయందు విశ్వాసమును తోసిపుచ్చాడు. కాని అప్రత్యక్షమగు సృష్టికర్త స్థానములో ప్రత్యక్షమగు భౌతిక పదార్థమును మార్క్సు ప్రతిపాదించాడు. ఈ పదార్థము యొక్క మార్పుల వలన ఇతర

ప్రకృతి విషయములతో పాటు మానవుని జీవితము, వాని రాగ ద్వేషములు, చిత్త ప్రవృత్తులు, రాజకీయ ఆర్థిక విషయములు ఏర్పడు చున్నవని మార్క్సు సిద్ధాంతము. అస్తిత్వమును అంతను భౌతిక పదార్థమునకు చెందించుటచేత మార్క్సిజమును భౌతిక సిద్ధాంతమంటారు. ఇది విశ్వవ్యాప్తమగు పదార్థము యొక్క పరిణామ దశలకు మానవుని ప్రవర్తనను లోబరుచుటచేత, మానవునకు స్వాతంత్ర్యము నిరాకరిస్తుంది. ఇట్లు మార్క్సు సిద్ధాంతముపైన కూడ బానిస ప్రవృత్తి యొక్క ప్రభావము పడింది.

### అదనపు విలువ

సిద్ధాంతములో బానిసభావము ఇమిడి యున్నప్పటికీ, అందరికీ అన్నవస్త్రములు లభించవలెనను ఆవేదనతోనే మార్క్సు తన భౌతిక సిద్ధాంతమును ప్రతిపాదించెను. అందరికీ అన్నవస్త్రములు లభించకుండుటకు అదనపు విలువ కారణమని మార్క్సు నిర్ణయము. అదనపు విలువ అనగా, ఒక కూలి ఇంకొకని పొలములో దినమంతా పనిచేయుటచేత రెండు రూపాయల విలువగు ఉత్పత్తి చేసినప్పటికి, తనకు కూలి రూపాయి పావల లభిస్తుంది మిగిలిన ముప్పావలా విలువ పొలముకల ఆసామికి చెందుతున్నది. అనగా తాను ఏమి శ్రమ చేయనప్పటికి, ఉత్పత్తి సాధనమగు పొలము స్వంత ఆస్తిగా ఉంచుకొనుటచేత, ముప్పావలా లాభమును భూస్వామి పొందుచున్నాడు. ఈముప్పావలాను అదనపు విలువ అంటారు. స్వంత ఆస్తి, కూలీల సంఖ్య ఎంత హెచ్చయితే, యజమానికి అంత లాభము అదనపు విలువ ద్వారా లభిస్తుంది. ఇదే దోపిడీకి,

ఆర్థిక అసమానతలకు దారితీస్తున్నది. అదనపువిలువ తొలగింపబడి, ఆర్థిక సమానత్వము ఏర్పడవలెనంటే, వ్యక్తిగత ఆస్తి నిర్మూలింపబడి భూమి, మిల్లు వంటి ఉత్పత్తి సాధనాలన్ని సమాజపరము కావలెను. అప్పుడు యజమాని – కూలీ అను తేడా నశించి, శ్రమ యొక్క ఫలితము సమాజము ద్వారా అందరికి సమముగా లభిస్తుంది. ఈరీతిగా అందరికి అన్నవస్త్రములు కావలెనంటే, ఆస్తి అంతా సమాజపరము కావలెనని మార్క్సు నిరూపించినంత స్పష్టముగా ఇంకెవ్వరూ చూపలేదు. ఈ విషయంలో మార్క్సు ఒక యుగపురుషుడు.

## వ ర్గ పో రా ట ం

కాని అదనపు విలువ నిర్మూలనను పదార్థ పరిణామదశలలో మార్క్సు ముడిపెట్టాడు. భౌతిక సిద్ధాంతరీత్యా అంతర్వైరుధ్యముల వలన పదార్థము మార్పు చెందుతుంది. మానవుల ఆర్థిక పరిస్థితులలోని అదనపు విలువలు ఈ అంతర్వైరుధ్యముల రూపములట. అదనపు విలువల వలన ఎక్కువతక్కువలు, ధనిక–పేద అను వర్గములు ఏర్పడుతవి. ఈ వర్గముల మధ్య వైరుధ్యమే వర్గపోరాటము. ధనిక వర్గమును శ్రామిక వర్గము ద్వేషిస్తుంది. తిరుగుబాటు చేస్తుంది. రెండువర్గముల మధ్య సంఘర్షణల ఫలితముగా అంతకంతకు భూమివంటి ఉత్పత్తిసాధనములు శ్రామికవర్గపరం అవుతవి.

శ్రామికులే ఉత్పత్తిసాధనాల అధిపతులు అయినప్పుడు అదనపు విలువ నశిస్తుందిగదా. ఇక దోపిడీకి అవకాశం లేదు. ఈ విధంగా ఆర్థిక సమత ఏర్పడి అందరకు అన్నవస్త్రములు

సమముగా లభిస్తవని మార్క్సు భౌతిక సిద్ధాంతం.

మానవ చరిత్రలో ఆస్తి సంబంధాలను అనుసరించి జమీందారులు, పెట్టుబడిదారులు, వ్యాపారస్తులు, శ్రామికులు అను వర్గాలు ఏర్పడుతవని మార్క్సు సిద్ధాంతము. దశదశ లుగా ఒక వర్గానికి, దాని పైవర్గానికి పోరాటం జరుగుతుంది. పోరాటం ఫలితంగా ఉత్పత్తి సాధనాలు క్రింది వర్గపరం అవు తవి. ఇట్లు మారుతూ-మారుతూ చివరకు ఆస్తి అంతా శ్రామిక వర్గపరం అవుతుంది. పదార్థము యొక్క అంతర్విరుద్ధ పరి ణామదశలే మానవ చరిత్రలో వర్గపోరాటరూపము పొందినవి. ఏ వర్గము ఆధిపత్యంలో ఉంటే మానవ చరిత్రయందు ఆ వర్గ రాజకీయ విధానము, సంస్కృతీ మర్యాదలు, లలిత కళల ఛాయలు ఉంటవి. వర్గ ప్రతిబింబమే మానవ జీవితము అని మార్క్సు సిద్ధాంతము.

## చైతన్యం

ఈ సిద్ధాంతరీత్యా మానవ స్వతంత్ర ప్రయత్నముకు తావు లేదు. పదార్థ పరిణామమును అనుసరించి పరిస్థితులు మారుతూ, ఆర్థిక రాజకీయ మార్పులు వస్తాయి. దీనిని బట్టి విప్లవ పరిస్థితులు విప్లవమును తీసుకురాగలవు. కాని అనుభవ ములో అట్లు జరుగుట లేదు. 1943, 44 లలో బెంగాలునందు లక్షల కొలది ఆకలిగొన్న ప్రజ అలాగే ఆహార గిడ్డంగుల ప్రక్కన చనిపోయినారు. మానవ జీవితంలో అంతకు మించిన విప్లవ పరిస్థితి లేదు. కాని ఆ విప్లవ పరిస్థితి ఆర్థిక విప్లవమును ఆనాడు ఎందుకు తీసుకు రాలేదు? ఇది మార్క్సు సిద్ధాంత,

మునకు సవాలు.

విప్లవమునకు విప్లవ పరిస్థితి తోడ్పడునే కాని విప్లవమును తీసుక రాలేదు. విప్లవము తెచ్చుటకు విప్లవ చైతన్యము అవసరము. ఈ చైతన్యముపై పరిస్థితుల ప్రభావం కొంత ఉన్నప్పటికి, పరిస్థితులను మించి కూడా చైతన్యం ఏర్పడుతుంది. పరిస్థితుల ప్రతిబింబము మాత్రమే చైతన్యం కాదు. ఉదాహరణకు దారిద్ర్యమునకు వ్యతిరేకముగా పనిచేసిన విప్లవకారులు తాము దారిద్ర్య పరిస్థితులలో పుట్టి పెరిగినవారు కారు. అలాగే నీగ్రో సమస్యకు, అస్పృశ్యతకు వ్యతిరేకముగా పనిచేసినవారు చాలామంది తాము నీగ్రోలు, అస్పృశ్యులు కారు. ఇట్లు పరిస్థితులు చైతన్యమును కలుగ చేయుటకంటే, చైతన్యమే పరిస్థితులను కలుగచేయుచున్నది. ఈ అనుభవమునుబట్టి మార్క్సు యొక్క భౌతిక సిద్ధాంతము మూలములో తప్పు ఉంది. అందరికి అన్నవస్త్రములు కావలెనను ఉన్నతాదర్శమును నిరూపించుటకై మార్క్సు పాత అలవాట్లబట్టి బానిస స్వభావము గల భౌతిక సిద్ధాంతమును ప్రతిపాదించాడు. ఈ బానిసతత్వమే మార్క్సు సిద్ధాంతంలోని పొరపాటు.

## నియంతృత్వము

ఆదర్శము ఎంత గొప్పదయినప్పటికి సిద్ధాంతములోని పొరపాట్లవలన మార్క్సు ప్రతిపాదించిన కమ్యూనిజము రాజకీయ నియంతృత్వమునకు దారితీసి, మానవ స్వేచ్ఛను అరికట్టినది. పరిస్థితుల వలన మానవుడు మారినట్లయితే ఆ పరిస్థితులు ఎలాగు మారుతవి అన్న ప్రశ్న మార్క్సిజమును ఎదుర్కొ-

న్నది. ఉత్త భౌతిక పరిస్థితి మార్పుల వల్ల ఆర్థిక రాజకీయ మార్పులు రావటములేదని అనుభవములో మానవ చరిత్ర ఋజువు పరుస్తున్నది కదా. అందుచేత ఆర్థిక సమత చైతన్యం కలిగిన వ్యక్తులు కొందరు ఆస్తి సమాజపరమగుటకు అనుకూలముగా పరిస్థితులను మారుస్తారనిన్నీ, ఈ పరిస్థితి మార్పువల్ల తక్కినవారంతా మారుతారనిన్నీ మార్క్సు కార్యక్రమాన్ని ఏర్పరిచాడు. పరిస్థితులను మార్చుటకు తగిన చైతన్యము కలవారు కమ్యూనిష్టులుగా ఎంచబడ్డారు. తామే పరిస్థితులను మార్చగలమనిన్నీ, తక్కిన వారందరు ఆ పరిస్థితులకు బానిసలుగా మారుతారనిన్నీ కమ్యూనిస్టులు తమపై ఒక అధిక్యతను మార్క్సు సిద్ధాంతరీత్యా ఆపాదించుకున్నారు. తెచ్చిపెట్టుకున్న ఈ ఆధిక్యత వల్ల సమాజము పైన నియంతృత్వాధికారాన్ని కమ్యూనిస్టులు కోరుతారు.

నాగరికత పెరుగవలెనంటే, ప్రజలందరిలోను స్వాతంత్ర్య చైతన్యం పెంపొందవలెను. ఈ ప్రభుత్వ విధానమునూ, ఈ ఆర్థిక పరిస్థితులను తానే నిర్మించుకున్నాననియు, తన కోరికబట్టి వాటిని మార్చుకొనగలననియు, స్వేచ్ఛగా ఆలోచించితే తప్ప సంఘమును తన సౌఖ్యసాధనముగా మానవుడు వినియోగించుకొనలేడు. కాని ఇట్టి స్వాతంత్ర్య చైతన్యము కమ్యూనిష్టులలోనే కలిగించి, ఇతరులందరిలోను పరిస్థితులకు బానిసత్వమును ప్రబోధించును కనుక, మార్క్సు సిద్ధాంతము నాగరికతాభివృద్ధికి తోడ్పడలేదు. మార్క్సు సిద్ధాంతాన్ని అనుసరించుటచేత అందరికీ ఆహారాన్ని అందజేసినప్పటికీ, ప్రజాస్వామ్యములో స్వేచ్ఛను పోషలిస్తు సామాజిక వ్యవస్థ

కుంటుపరచింది. దైవానికి దాసోహం అన్నా, ప్రభుత్వానికి దాసోహం అన్నా, పరిస్థితులకు దాసోహం అన్నా, వ్యక్తి స్వేచ్ఛకు అడ్డుపడటంలో ఫలితంఒక్కటే. ప్రజాసామాన్యంలో స్వాతంత్ర్య ప్రవృత్తిని ప్రోత్సహించలేని ఏ సిద్ధాంతమయినా సక్రమ నాగరికతకు సరిపోదు.

సా ధ్య ము — సా ధ న ము

మార్క్సు సిద్ధాంతము కమ్యూనిష్టు నియంతృత్వము నకు దారితీసినప్పటికీ, మార్క్సు యొక్క ఆశయము శాసన రహిత సమాజమే. అనగా ప్రభుత్వయంత్రము కృశించిపోయి ప్రజలు స్వేచ్ఛతో మెలుగుతే ఆదర్శ సమాజమని మార్క్సు అంగీకరించారు. ఆదర్శమును సాధించుటకై, ఆదర్శమునకు అనుగుణమగు సాధనమునే ఉపయోగించవలెను. ప్రభుత్వమును కృశింపచేయవలెనంటే, ప్రభుత్వపుఅధికారములనుఅంతకంతకు ప్రజలకు సంక్రమింపజేసి, ప్రభుత్వమును బలహీన పరచవలెను. అట్లుకాక ప్రభుత్వమును నియంతృత్వము వైపు నడిపినచో, ప్రభుత్వము కృశించదు సరిగదా, మరింత బలపడి ప్రజలను నలిపి వేస్తుంది. మార్క్సు సిద్ధాంతము చేసిన పొరపాటులలో ఇది కూడా ఒకటి. సాధ్యమునకు సాధనమునకు సంబంధము లేకుండా పోయింది. మార్క్సు ఆశయము ఒకటి అయితే, జరుగుతున్నది ఇంకొకటి.

సక్రమ నాగరికతాలక్షణమగు స్వాతంత్ర్యమును మానవులు అనుభవించవలెనంటే, సమాజము శోషణ, శాసన రహితముగా ఉండవలెనని గుర్తించి దానికి అనువగు కార్యక్రమ

షులను నిర్ణయించినవారిలో నేటి యుగమందు గాంధీ మహాత్ముడు ముఖ్యుడు. ఈ సమాజమందుగల లోటును గ్రహించి దానిని ఆయన సరిదిద్దారు.

సంఘము - సమూహము

నేటి సమాజనిర్మాణమందు దేశముల వేరిట కోట్లకొలది ప్రజ గుంపులు గుంపులుగా చేరియున్నారు. ఇట్టి పెద్ద పెద్ద గుంపులు సక్రమ సంఘ నిర్మాణమునకు సరిపోయినవి కావు. సక్రమ సంఘమందు ప్రజలు పరస్పరము సంప్రదించుకొనుచు సహకరించుకొనుచుండవలెను. కాని కోట్ల కొలది ప్రజ ఒక సమూహములో చేరి ఉన్నప్పుడు ఇట్టి సంప్రదింపులకు అవకాశము లేనే లేదనవచ్చు. సమూహ సమాజ స్థితికి నేటి పట్టణములే తార్కాణము. పట్టణముల్లో వేలు, లక్షలు ప్రజ కలసి నివసించుచున్నను వారికి ఇరుగు పొరుగువారి సంగతి తెలియనే తెలియదు. పట్టణజీవితంలో ఎవరిమట్టుకువారు పొట్టతిప్పలు పడు టవరకేగాని, ఇతరులతో సహకార సంప్రదింపులకు వీలులేదు గదా. ఈ గుంపు స్థితియందు ఈ లోటు ఉన్నది. ఇది సంఘ నిర్మాణమునకు అనువుగా లేదు. అందుచేత గాంధీమహాత్ముడు దీనిని ఖండించి, సక్రమ సంఘనిర్మాణమునకు చిన్న చిన్న జనాభాగల గ్రామరాజ్యము ఏర్పడవలెనని ప్రతిపాదించాడు. గ్రామరాజ్యమందు పరస్పరము సహకార సంప్రదింపులకు అవకాశము ఉన్నది. సహకార సంప్రదింపుల వలన సంఘబలము పెరిగి మానవులు స్వాతంత్ర్య భావమును పెంపొందించుకొందురు.

కమ్యూనిస్టులు తమలో తాము సక్రియ సంఘ నిర్మాణము చేసుకొనుటకై, వారి ప్రాథమికసంఘములు చిన్న చిన్న సెల్లులు (*sells*) గానే నిర్మించుకుంటారు. సెల్లు నిర్మాణము ద్వారా కమ్యూనిస్టులు గట్టి సంఘముగా ఏర్పడగలిగినారు. అంతేగాని కమ్యూనిస్టులందరు వందలు, వేల కొలది ఒక పెద్ద గుంపుగా వ్యవహరిస్తే, వారిలో ఈ సంఘీభావము పెరుగుటకు అవకాశముండేది కాదు. గ్రామరాజ్యరూపమగు సెల్లు నిర్మాణ విధానమును ఆరంభించుటచేతనే కమ్యూనిస్టులు గట్టి సంఘముగా ఏర్పడగలిగినారు.

కమ్యూనిస్టులకు తమలో తమకున్న విశ్వాసము సామాన్య ప్రజ పైన లేదు. ఇందుకు మార్క్సు సిద్ధాంతమే కారణము. అందుచేత వారికి రెండు రకములైన నీతులున్నవి. తమలో తాము అనుసరించు నీతి ఒకటి, ఇతర ప్రజల ఎడల వర్తింపచేయు నీతి ఇంకొకటి. పరిస్థితులను మార్చగల స్వాతంత్ర్యము తమకే కలదని అనుకొనుటచేత కమ్యూనిస్టులు సెల్లులు ద్వారా గట్టి సంఘ నిర్మాణమును చేసుకుంటారు. కాని పరిస్థితుల వల్ల మారునట్టి బానిసలు ఈ మామూలు ప్రజ అని అని భావించుటచేత, సామాన్య ప్రజను వారు పెద్ద పెద్ద గుంపులలో నొక్కి ఉంచి, వారిపై రాజకీయ నియంతృత్వమును కొనసాగిస్తారు. గుంపులలో ప్రజను పెట్టకపోయినట్లయితే, వీరి రాజకీయ నియంతృత్వము నెరవేరదు. కనుక కమ్యూనిస్టులు ఎప్పుడూ సామాన్యప్రజలలో గుంపులనే ప్రోత్సహిస్తారు గాని సంఘ నిర్మాణమును ప్రోత్సహించరు.

గాంధీ మహాత్ముడు ప్రజలందరి యెడల సమదృష్టి గల

వాడు. మార్క్సిజము వంటి బానిసభావ ప్రేరిత సిద్ధాంతమును ఆయన కాళ్లకు సంకెళ్లుగా తగిలించుకోలేదు. తాను ఏ స్వాతంత్ర్యమును కోరుతున్నాడో, ఇతరులకు అదే కోరుతాడు. అందుచేత సక్రమ సమాజనిర్మాణమునకు చిన్న చిన్న సంఘములు అవసరమైతే ఆ విధానమును ఈ దేశము, ఆ దేశము; ఈ పార్టీ, ఆ పార్టీ అను భేదా లేకుండా ప్రజలందరు అనుసరించవలసినదేనని గాంధీ మహాత్ముని ప్రతిపాదన. అందుచేత మానవసంఘ నిర్మాణమునకు, దాని ద్వారా శాసన, శోషణ రాహిత్యమునకు గ్రామరాజ్య నిర్మాణము అవసరమని గాంధీమహాత్ముడు తేటతెల్లము చేసినాడు. గాంధీమహాత్ముని అనంతరము భూదానోద్యమము నడుపుచున్న వినోబాజీ కూడ గ్రామరాజ్య స్థాపనే లక్ష్యముగా ఏర్పరచుకున్నారు.

## సమానత్వము

సక్రమ నాగరికతాభివృద్ధికి స్వాతంత్ర్యమెంత అవసరమో, సమాజంలో సమానత్వము కూడ అంత అవసరము. ఆకలి దప్పులలోను, రాగ ద్వేషములలోను, శక్తి సామర్థ్యములలోను దరిదాపు మానవులందరు సమానులే. పులికి మేకకు ఉన్న సహజమైన భేదాలు మానవుల మధ్య లేవు. పులి ఎన్నటికీ మేక కాలేదు. మేక ఎన్నటికీ పులికాలేదు. కాని నేటి ధనికుడు రేపటి ఫకీరు కావచ్చు. రేపటి ఫకీరు ఎల్లుండి ధనికుడూ కావచ్చు. అలాగే సామాన్యపౌరులు, మంత్రులయొక్క స్థానములు ఎన్నికలవలన మారుతూ ఉండవచ్చు. కనుముక్కు తీరులలోను, ఒడ్డుపొడుగులలోను, శరీర రంగులలోను, అభిరుచుల

లోను మానవులమధ్య సహజంగా కొన్ని తేడాలు ఉన్నప్పటికీ ఈ తేడాలకు ధనిక-పేద, యజమాని-సేవక అను తేడాలకు సంబంధము లేనేలేదు, అందుచేత సమాజమందు మానవులందరికి ఆర్థిక, రాజకీయ అవకాశములు సమానముగా ఉండుటే సాంఘిక ధర్మము. ఇట్టి సమానతను సాధించవలెనంటే ఉత్పత్తి సాధనమగు ఆస్తియంతా సమాజపరము కావలెనే కాని, వ్యక్తిగత అస్తి ఉండరాదని మార్క్సు చెప్పిన రీతిలో ఎంతో అర్థమున్నది.

వ్యక్తిగత ఆస్తి ఉన్నప్పుడు, తన జీవిత సౌకర్యముల కొరకు ఇరుగు పొరుగులవారి ఆదరాభిమానములకంటే తన అస్తినే మనిషి ఎక్కువ నమ్ముకుంటున్నాడు. ఎంత ఆస్తి ఉంటే అంత సులభముగా అన్నవస్త్రములను, విద్యా వినోదములను కొనుక్కుంటున్నాడు. అందుచేత వ్యక్తిగత ఆస్తివిధానములో ప్రతివాడు తన ఆస్తిని పెంచుకుంటూ రక్షించుకొనుటకు తాపత్రయ పడుచున్నాడు. దీనివలన మనుష్యుల మధ్య పోటీ, ఈర్ష్య, మోసము, దౌర్జన్యము, స్వార్థము ప్రబలు చున్నవి. శాంతికి భంగము కలుగు చున్నది.

రాజకీయ నియంతృత్వమునకే కాక, ఆర్థిక దోపిడీకి కూడా పట్టణములవంటి పెద్ద పెద్ద గుంపులు అవకాశమిస్తున్నవి. పరస్పర సహకారసంప్రదింపులుగల సంఘములలో నియంతృత్వమునకు, దోపిడీకి చోటు లేదు. అందుచేత రాజకీయ నియంతృత్వవాదులేకాక, ఆర్థిక పీడన స్వభావముగల వ్యక్తిగతఆస్తి వాదులు కూడా కులములు, మతములు, రాష్ట్రములు, దేశములు పేరిట పెద్ద పెద్ద గుంపులుగా ప్రజలు చేరుటను ప్రోత్స

హిస్తారు. కాబట్టి నియంతృత్వము, దోపిడీలను తొలగించి స్వేచ్ఛ సమానత్వములను నెలకొల్పవలెనంటే సక్రమ సంఘ నిర్మాణమునకు అనువగు గ్రామరాజ్య పద్ధతే సరియైనది.

## నిస్పృహ - పరిష్కారము

నేటి ఆర్థిక, రాజకీయ సమస్యలకు గ్రామరాజ్య స్థాపనే పరిష్కారమార్గమని గుర్తించలేక, ఈ మోసాలు, దౌర్జన్యాలు, దారిద్ర్యం, నియంతృత్వము చూచి కొందరు నిస్పృహ చెందు తారు. కోర్కెలు వృద్ధి చేసుకొనుటచేత వాటిని నెరవేర్చు కొనుటకై ఈ ఆర్థిక, రాజకీయ చిక్కులలో తగుల్కొనవలసి వచ్చుచున్నది కనుక, కోర్కెలను తగ్గించుకుంటే ఈ సమస్యలే లేకుండా పోతవని వీరి అలోచన. ఇట్టి దృష్టి కలవారు పర లోక సౌఖ్యమును నమ్ముతారు. ఈ ఇహలోకమున కోర్కెల యెడల ఉదాసీనత వహించి, పరలోక సుఖమును వీరు కాంక్షి స్తారు.

పరలోకము యొక్క అస్తిత్వము గురించి అభిప్రాయ భేదములు ప్రక్కకు పెట్టినను, ఈ మత విశ్వాసము కలవారిలో నిష్క్రియత్వం వ్యాపించుట మాత్రము ప్రత్యక్షము. నిష్క్రి యత్వము వలన వీరు సమాజమునకు బరువై పోతారు. నియంతృత్వమును, దోపిడీని ధైర్యముతో ఎదుర్కొని వాటిని రూపు మాపేబదులు, వీరు తల ఒగ్గి పరోక్షంగా వాటికి తోడ్పడు తారు. ఈ నష్టములన్నీ నిస్పృహవలన సంభవించాయి. కాని ఆర్థిక, రాజకీయ సమస్యలకు గ్రామరాజ్యం ఎట్లు పరిష్కార మార్గమో వారికి నచ్చ చెప్పితే, నిస్పృహ తొలగి పోగలదు.

గ్రామరాజ్యమందు కూడా కొందరు తమ వ్యక్తిగత కోర్కెలను తగ్గించుకోవలసి వచ్చును. అయితే అది నిస్పృహ వల్ల కాదు. అసమానతలను సమానతలవైపు మార్చునప్పుడు, వ్యక్తిగతంగా అధిక సౌఖ్యములు అనుభవించుచున్నవాడు తోటి మానవుల సౌఖ్యం కొఱకై తమ సౌఖ్యమును త్యాగము చేయవలెను. సమానత్వము ఏర్పడుటతో పాటు అందరి సౌఖ్యాభివృద్ధి కొఱకు అందరూ కలసి కృషి చేయగలరు. ఇందులో నిష్క్రియత్వము లేదు సరికదా, వ్యక్తిగత సౌఖ్యాభివృద్ధికంటె సమిష్టి సౌఖ్యాభివృద్ధి కొఱకు కృషిచేయునప్పుడు ఇంకా ఎన్నోరెట్లు కార్యకౌశల్యమును పెంచుకొన వలెను.

# 4

# సంఘ నియమాలు

## జడము - చేతనము

మానవుడు తన సౌఖ్యాభివృద్ధికి యంత్రములను, సంఘమును సాధనములుగా ఉపయోగించుకుంటున్నాడు. కాని ఒక వైపు యంత్రములతోను రెండవ వైపు సంఘముతోను వ్యవహరించినప్పుడు అతని ప్రవర్తనలో భేదము కావలసివస్తున్నది. యంత్రములు జడపదార్థములు. వాటంతట అవి కదులలేవు. వాటిని మానవుడు నడిపించవలెను. వాటి నడక భౌతిక నియమాలను అనుసరిస్తుంది. కాని సంఘము అటువంటిది కాదు. సంఘ నిర్మాణమందు మనుష్యుడు తనవంటి మనుష్యులతోనే

వ్యవహరించాలి. మనుష్యులకు రాగద్వేషాలుంటాయి. చైతన్యముంటుంది. యంత్రములు భౌతిక నియమాలప్రకారం నడిస్తే మానవుల ప్రవర్తన మానసిక పద్ధతుల రీత్యా ఉంటుంది. అందుచేత యంత్రములతో వ్యవహరించుటకు, తోటిమానవులతో వ్యవహరించుటకు చాలా తేడా ఉంది. ఈ తేడాను గుర్తించక భౌతిక పదార్థమునకూ, మానవ చరిత్రకూ ఒకే నియమములను వర్తింపచేయుటచేత మార్క్సిజము తప్పుదారినిబట్టి రాజకీయ నియంతృత్వములోనికి దిగజారిపోయింది.

చైతన్యము, వ్యక్తిత్వముగల మానవులతో సంఘమును నిర్మించునప్పుడు యంత్రములకు భిన్నములగు కొన్ని నియమాలను పాటించవలసి ఉంటుంది. అవి సత్యము, సహనము, సమానత్వము.

## సత్యము

సత్యము అనగా చెప్పినట్లు చేయుట, చేసినట్లు చెప్పుట. ఇట్టి సత్య ప్రవర్తన సభ్యులలో ఉంటేనేతప్ప పరస్పరము సహకారము, సంఘ నిర్మాణము కుదరదు. సంఘము అనగా ప్రజా సమూహమే కాదు. సంఘములోని వ్యక్తులు పరస్పరము అర్థము చేసుకుంటూ, సమిష్టి కార్యములందు సహకరించుకుంటూ ఉండాలి. ఒకరు చెప్పినట్లు చేస్తారు, చేసినట్లు చెప్తారు, అని ఇంకొకరికి నమ్మకము లేకపోతే పరస్పరము సహకారము కుదురనేరదు. అందుచేత సత్యప్రవర్తన సంఘ నిర్మాణమునకు మూలాధారము.

## సహనము

సత్యము రీతిగానే సహనము కూడా సంఘ నిర్మాణమునకు అవసరము. మనుష్యులు దరిదాపు సమానులు అయినప్పటికీ, అభిప్రాయాలలో సూక్ష్మమైన భేదాలు కూడ ఉంటాయి. నూటికి నూరు పాళ్లు ఒకరితో ఇంకొకరు ఏకీభవించలేరు. అభిప్రాయ భేదము మనుష్యులను క్రొత్తగా ఆలోచింపచేసి మార్పులు తెస్తుంది. నిజానికి ఇద్దరు మనుష్యుల మధ్య భేదమే కాకుండా ఒకే వ్యక్తిలో నిన్నటికి ఇవ్వాళ్టికి అభిప్రాయాలు భేదిస్తూ ఉంటాయి. అభిప్రాయ భేదము అభివృద్ధికి సూచన.

ఎవరి అభిప్రాయాల మీద వారికి ఎప్పటికప్పుడు అభిమానము, విశ్వాసము ఉండుట సహజమే. కాని సంఘములో పది మందితో వ్యవహరిస్తున్నప్పుడు, తన అభిప్రాయాల మీద తనకెంత గౌరవమున్నదో ఇతరులకు వారి అభిప్రాయాలమీద వారికి అంత గౌరవముంటుందని గ్రహించాలి. అప్పుడు తన మీద తనకే కాక, ఇతరుల మీద కూడ గౌరవం ఏర్పడుతుంది. ఇట్టి గౌరవమునే సహనం అంటారు.

ఇద్దరికి కలసిన అభిప్రాయాల మీద ఎలాగా సహకరించుకోవచ్చు. కాని భిన్నాభిప్రాయాలమీద సహనం లేకపోతే అసలు మొదటికే మోసం వస్తుంది. ఏకాభిప్రాయం యడల సహకారం కంటె, భిన్నాభిప్రాయాల యడల పట్టుదల పెరుగుతుంది. తాబట్టిన కుందేటికి మూడే కాళ్లంటూ ఇతరులను నిర్బంధించడం, హింసించడం జరుగుతుంది. నియంతృత్వాలకు ఇట్టి మూఢపట్టుదలలే పునాది. భేదాభిప్రాయాలయడల ప్రారంభంలో సహనం ఉంటే, అంతకంతకు అనుభవంమీద ఫలితం

బట్టి ఏ అభిప్రాయం సరియైనదో బుజువై పోతుంది గదా! ఇట్లు సహనం వలన భేదాభిప్రాయాలుకూడా ఏకాభిప్రాయాల లోనికి మారిపోగలవు.

స మా న త్వ ము

ఆకలి దప్పులలోను, శక్తి సామర్థ్యాలలోను మానవులందరు దరిదాపు సమానులే కనుక సంఘ సంబంధాల్లో సమానత్వము ఉండుట న్యాయము. సమానత్వమనగా సమాజము మీాదన ఉత్పత్తియైన ఆస్తిని అనుభవించుటలో సభ్యులందరు సమభాగులు కావలెను. ఈ సమభాగత్వము కొలతలలో సమభాగత్వము కాకపోవచ్చు. చిన్న పెద్ద పిల్లల మధ్య అన్నమును తల్లి ఏ విధముగా పంచి సమభాగత్వమును పోషిస్తుందో, అదే విధంగా సమాజంలోని వేరు వేరు వ్యక్తులమధ్య సమభాగత్వము ఉండవచ్చును. రోగులు, వృద్ధులు, పిల్లలు, వికలాంగులు ప్రత్యేక శ్రద్ధను పొందవచ్చును. కాని ఈ ప్రత్యేకతలలో పెద్ద తేడాలు ఉండవు. మొత్తముమీాద సమభాగత్వమునకు, సమానత్వమునకు సన్నిహితముగానే ఉంటుంది. ఇట్టి సమభాగత్వము లేకపోతే వ్యక్తులమధ్య ఈర్ష్యలు పెరిగి, సహకారము సన్నగిలి, సంఘబలము క్షీణిస్తుంది.

స జీ వ స మా జ ము

సత్యము, సహనము, సమానత్వముగల ప్రవర్తనను నీతి ప్రవర్తన అంటారు. నీతి మానవ మానసిక లక్షణము. ఇది ప్రోత్సాహంపు వలన, ప్రయత్నం వలన పెరుగుతుంది. ప్రబో

ధం వలన వ్యాపిస్తుంది. వ్యక్తుల స్వప్రయత్నంతో నీతిని వృద్ధి చేసుకొనుట చేతనే సంఘం బలపడి మనుష్యులకు సౌఖ్యం ఇస్తుంది.

సమాజం సజీవమైన ప్రయత్న ఫలితం. రాళ్ళు గుట్ట పోసినట్లు, కర్రపుల్లలను కట్టకట్టినట్లు రాజకీయ శాసన నిర్బంధం చేతనో, ఆర్థిక అవసరాల చేతనో కొంతమందిని కలిపి ఉంచితే అది సమూహము, గుంపు అవుతుంది గాని, సమాజం కాదు. నిర్బంధం తొలిగిపోగానే అందులోనివారు చెదిరిపోతారు. వ్యక్తులమధ్య నీతి ప్రవర్తనగల సహకార సంప్రదింపులు ఉంటేనే సంఘం ఏర్పడుతుంది. ఇట్లు సమాజనిర్మాణము వ్యక్తుల నీతిప్రవర్తన ఫలితమేగాని, భౌతిక నియమాలవలన, నిర్బంధం వలన ఏర్పడేది కాదు.

# 5

# సంఘనిర్మాణము

## ఇంటా — బైటా

సంఘనిర్మాణానికి ప్రజలలో నీతి ప్రవర్తన పునాది. కాని నీతి ప్రవర్తన ఈనాడు కుటుంబాలకు, కమ్యూనిస్టు సెల్లుల వంటి చిన్న చిన్న సంస్థలకు పరిమితిమై ఉన్నది; విశాలంగా ప్రజాసామాన్యంలో లేదు. కుటుంబంలోని బంధువులు వారిలో వారు అబద్ధాలు చెప్పుకోరు. హింసించుకోరు. పెద్ద ఎక్కువ తక్కువలు లేకుండా అన్న వస్త్రాలలోను, గౌరవ

మర్యాదలలోను సమానంగానే ఉంటారు. ఇట్లు వారి మధ్య సహకార సంప్రదింపులు, సత్యము, సహనము, సమానత ఉంటాయి కాబట్టే కుటుంబంలో సఖ్యత, సౌఖ్యం ఉన్నాయి. అలాగే కమ్యూనిస్టులు తమలో తాము నీతితో వ్యవహరించుకుంటారు. కాని ఒక కుటుంబం ఇతరులతో వ్యవహరించినప్పుడూ, కమ్యూనిస్టులు ఇతరులతో వ్యవహరించినప్పుడూ నీతిని పాటించరు. మోసంతోను, దౌర్జన్యంతోను ఇతరులపై నియంతృత్వంసాగించడానికి, ఆర్థికంగా దోచుకోవడానికి ప్రయత్నిస్తారు. అందుచేతనే కుటుంబాల్లోను, సెల్లులలోను సౌఖ్యం ఉన్నా, బైటకు వచ్చేసరికి మోసం, దౌర్జన్యం, యుద్ధం, దోపిడి కనబడుతున్నవి. వ్యక్తుల సంబంధాలు ఇల్లు, సెల్లుతో సరిపోదు. ఇతరులతో కూడా ఉంటాయి కనుక బైట నున్న అశాంతి వలన ఇంట్లో శాంతి భగ్నమై పోతున్నది. బైట మోసాలు, దౌర్జన్యాల వలన ఇంట్లో దారిద్ర్యం, చికాకు వ్యాపిస్తున్నవి. అందుచేత సంఘంవలన మనిషి సౌఖ్యం పొందాలంటే నీతి ప్రవర్తన ఇంటా బైటా కూడ ఉండాలి. ఇంట్లోని నీతిని బయటకు వ్యాపింప చేయడం ఎట్లనేదే సంఘ నిర్మాణ సమస్య.

సంఘ నిర్మాణం మూడు పద్ధతులుగా జరుగుతుంది. (1) మత విశ్వాసం (2) రాజనీతి (3) లోకనీతి.

## మత విశ్వాసం

దైవభీతి, స్వర్గకాంక్ష, నరకభయము, కర్మసిద్ధాంతము మొదలగు నమ్మకముల వలన ప్రజ నీతికి కట్టుబడి, అవినీతికి

పెరచి ఉంచేవారు. ఈ రోజుకి కూడా దైవ విశ్వాసం అంటే నీతి ప్రవర్తన అను ప్రతీతి ఉంది. కాని మత విషయములు నిర్ధారణకు నిలచునవి కావు. అంచేత విజ్ఞానము పెరుగుచున్న కొద్దీ మత విశ్వాసములు సన్నగిల నాచ్చాయి. మత విశ్వాసము తొలగిపోతే దానిపైన ఆధారపడియున్న నీతి ప్రవర్తనకు భంగం వస్తుంది కనుక, వెనువెంటనే ప్రభుత్వ సంస్థ కూడా బయలు దేరింది.

## రా జ నీ తి

రాజనీతి అనగా ప్రభుత్వపరిపాలన. ప్రభుత్వం ప్రత్యక్ష విషయం. ఇది నీతిని ప్రోత్సహించలేకపోయినా, అవినీతిని దండించ గలదు. దీని లాభనష్టాలు మరణాంతర పరలోక విషయాలు కావు. ఇప్పుడు ఇక్కడే జైలు, జరిమానాలతో అవినీతిపరులను శిక్షిస్తుంది.

మత విశ్వాసమందు మూఢనమ్మక ఉన్నప్పటికీ దానిని అంగీకరించినవారు దానికి సంబంధించిన నీతిని స్వేచ్ఛతోనే పాటించేవారు. కాని ప్రభుత్వ శాసనంలో నిర్బంధం స్పష్టంగా కనబడుతుంది.

## లో క నీ తి

మత విశ్వాసములో అంధత్వము, రాజనీతిలో నిర్బంధము ఉండుటచేత, అవి పూర్తిగా సత్యము, సహనము, సమానత్వములను నీతి– నియమములుగా ప్రోత్సహించలేదు. ప్రతి మతము పరమతము యెడల అసహనాన్ని పురిగొల్పింది. ప్రభుత్వ శాసనాలు అసమానత్వాన్ని పోషించాయి. అందు

చేత నీతిని స్వేచ్ఛతో పాటించుటకు లోకనీతి విధానమును వినోబా గారు ప్రతిపాదించారు,

లోకనీతి అనగా సత్యము, సహనము, సమానత్వముల అచరణను సంఘాచారములుగా అనుసరించుట. ఉదాహరణకు తల్లి పిల్లలను పోషించుట, భార్యాభర్తలు అన్యోన్యముగా ఉండుట సంఘాచారములు. వాటిని శాసించరు. సాంప్రదాయ సిద్ధముగా వస్తున్న అలవాట్లు అవి. అట్లే సత్యము, సహనము, సమానత్వము ఆచరించుటకు ప్రజలు అలవాటుపడిపోవుటే లోకనీతి.

లోకనీతి పద్ధతిలో మతము, ప్రభుత్వ సంస్థలను బహు వ్యయ ప్రయాసలతో నిర్మించుకోనక్కరలేదు. పిల్లలను పోషించని తల్లిని ఇరుగు పొరుగువారే మందలించునట్లు, సత్యము, సహనము, సమానత్వములను పాటించని అవినీతిపరులను ఎక్కడికక్కడివారే దారిని పెట్టుతారు. నీతివంతుని మీద నిర్బంధం అవసరంలేదు. కాని అవినీతిపరులను మందలింపు, వెలివంటి పద్ధతులతో ఇరుగు పొరుగువారేచక్కదిద్దుకుంటారు.

## ప్రజాస్వామికము

సంఘ నిర్మాణమునకు లోకనీతి పద్ధతి ఉత్తమైనది. కాని మత విశ్వాసములను, ప్రభుత్వ శాసనములను ఇంకా బలముగా ఉన్న నేటి గుంపువంటి సమాజమును లోకనీతి వైపు నడిపించుటకు ప్రజాస్వామికము వీలుగా ఉన్నది. ప్రజాస్వామికమందు అంధవిశ్వాసమునకు తావులేదు; మరియు ప్రభుత్వం రాజుల స్వాధీనములో ఉంటే, రాజులు నిరంకుశులగుటకు

వీలుండెను. ఈ రెండు కష్టముల నుండి తప్పించి నాగరికతను లోకనీతి వైపు ప్రజాస్వామికము తీసుకు పోగలదు.

ప్రజాస్వామికమనగా ప్రజలు తమకుతామే పరిపాలించు కొనుట. కాని నేటి చైతన్య స్థితిలో ప్రతి మనిషి ప్రభుత్వ శాసన నిర్మాణమందు పాల్గొనలేడు. అందుచేత ప్రజలు ప్రతి నిధులను ఎన్నుకొని, ఆ ప్రతినిధులు శాసన సభ్యులుగా వ్యవ హరించి పరిపాలించుట ప్రజాస్వామికమందు ఆచారమైంది.

ప్రతినిధులు తమ ప్రజల యొక్క భావాలను శాసనసభ యందు నిష్పక్షపాతబుద్ధితో ప్రతిబింబించినట్లయితే ఈ ప్రజా స్వామికమందు కూడా ప్రజలకు కొంత స్వేచ్ఛ, నీతికూడా ఉం టుంది, కాని నేటి ప్రజాస్వామికమందు కొన్ని లక్షల ప్రజకు ఒక ప్రతినిధి ఉండుటచేత, ప్రభుత్వమందు ప్రాతినిధ్యము సక్రి మమునా జరుగుటలేదు. భిన్నభిన్న భావములుకల లక్షలప్రజల భావములను ఒక ప్రతినిధి ప్రతిబింబించుట అసాధ్యము. అంతేకాదు, ప్రతినిధికి కూడా రాగద్వేషాలున్నాయి. ఎన్నిక అయిన తరువాత అతను తన నియోజకవర్గపు ప్రజలను నిర్లక్ష్య ముచేసి, తన స్వప్రయోజనములకు శాసన సభలో ఉన్న అధి కారమును దుర్వినియోగము చేసుకోవచ్చు. వ్యక్తిగత ఆస్తి ఉన్న ఈ వ్యవస్థలో అధికార దుర్వినియోగమునకు అవకాశము హెచ్చుగా ఉంటుంది.

మరియు నియోజకవర్గము పెద్దది అయిపోతున్నకొద్దీ ప్రజల అందుబాటులో ప్రతినిధి ఉండడు. అతని అధికారదుర్వి నియోగాన్ని ప్రజలు అరికట్టలేక పోతారు. ఈ ప్రజాస్వామి కములో ఉన్న లోపము ఇదే. ఏ అన్నవస్త్రాలను, స్వేచ్ఛను,

నీతిని ప్రజలు ఆశించారో, అవి ఈ ప్రజాస్వామికము ద్వారా నేడు లభించుట లేదు. కంచె మేసిన చేను రీతిగా ప్రజ నిస్సహాయులవుతున్నారు. ఆపద్ధర్మముగా స్వేచ్ఛనైనా వదలుకొని ఆహారాన్ని సంపాదించుకొనుటకై రాజకీయ నియంతృత్వాలకు లోబడిపోతున్నారు.

ఈ ప్రజాస్వామికములోని లోటును తీర్చిదిద్ది, ప్రజలకు అన్నవస్త్రములు, స్వేచ్ఛ, నీతి కలుగచేసి లోకనీతి విధానము వైపు పురోగమింప కలిగింది గ్రామరాజ్య పద్ధతి.

# 6

# గ్రామమంటే ఏమిటి

## ఈ గ్రామము - ఆ గ్రామము

గ్రామ మనగానే నేడు భారతదేశంలో కష్టలతోను, దారిద్ర్యముతోను, అజ్ఞానముతోను ఆవరింపబడియున్న గ్రామాలు స్ఫురించవచ్చు. గ్రామరాజ్యము ఏర్పడితే ఇటువంటి దుస్థితే ఏర్పడుతుందేమోనని భయము కూడకలుగవచ్చు. కాని గ్రామరాజ్య గ్రామములు సంఘనిర్మాణమునకు, సక్రమ ప్రజాస్వామికమునకు మూల సంస్థలు ( Social administrative units) జనాభా సంఖ్యలో భారతదేశ గ్రామాలు గ్రామరాజ్య గ్రామాలతో పోలియుండవచ్చు. కాని ఆర్థిక, రాజకీయ విధానములలో ఈ గ్రామాలకు ఆ గ్రామాలకు హస్తిమశకాంతరం తేడా ఉంది.

## సక్రియ ప్రజాస్వామికము

పూర్తి స్వేచ్ఛ, సమానత్వము ఉండాలంటే, పూర్తి నీతి ప్రవర్తనతో లోకనీతిగల శాసనరహిత సమాజమును నిర్మించుకోవాలి. అంత సంఘ చైతన్యం ప్రజానీకంలో లేనప్పుడు ఎంతో కొంత రాజనీతిని అంగీకరించాలి. అయితే రాజనీతి వలన కలిగే నిర్బంధం ఎంత తక్కువ అయితే అంత మంచిది. ఒక వైపున నీతిని పెంచుకుంటూ, రెండో వైపున నిర్బంధాన్ని తగ్గించుకొనుటకు అవకాశం ఉన్నది ప్రజాస్వామికం.

నేటి ప్రజాస్వామికములో నియోజకవర్గములు పెద్దవగుటచేత ప్రతినిధులు స్వార్థులై ప్రజలను నిర్లక్ష్యం చేయుటకు వీలయింది. కాని ప్రజలకు, ప్రతినిధులకు సన్నిహిత సంబంధ ముండుటకు తగిన నియోజకవర్గములను నిర్మించుకుంటే ఈ లోటు తీరి, సక్రమ ప్రజాస్వామికం ఏర్పడుతుంది.

### నియోజకవర్గం

సాధారణంగా మానవునికిగల జ్ఞాపకశక్తి, కార్యదీక్ష గుర్తించినట్లయితే, రెండు మూడు వందల ప్రజకు ఒక ప్రతినిధి సక్రియంగా ప్రాతినిధ్యం వహించగలడు. అటువంటి నియోజకవర్గములో ప్రజలకు, ప్రతినిధికి సన్నిహిత సంబంధ ముంటుంది. ప్రతినిధి స్వార్థుడైనప్పుడు ఈ ప్రజలు వానిని అదుపాజ్ఞలలో పెట్టుటకు వీలుంటుంది. ప్రజలు, ప్రతినిధి ఒకరికొకరు ఎదుట ఉండుటచేత ప్రజాభిప్రాయమును ప్రతినిధి చాల వరకు ప్రతిబింబించగలడు.

గ్రామ సభ

సక్రమ ప్రాతినిధ్యమునకై నియోజకవర్గము యొక్క జనాభా రెండు, మూడు వందలకు పరిమితి అయినట్లు, శాసన సభలో ప్రతినిధులందరు ప్రతి విషయము మీద తమ అభిప్రాయములను తగు కాలములో వెల్లడించవలెనంటె ఆ శాసన సభలో పది, పదిహేనుగురు సభ్యులుండవలెను. అంతకంటే తక్కువ సంఖ్య అయితే సమస్యను అన్ని వైపుల నుండి పరిశీలించుటకు వీలుండదు. పదిహేనుగురుకంటె సంఖ్య హెచ్చయితే అందరు సభ్యులు అన్ని విషయముల చర్చలలోను పాల్గొనలేరు. కొందరు సభ్యులలో అశ్రద్ధ ఏర్పడుతుంది. అందుచేత ప్రజాప్రాతినిధ్యపు గ్రామ శాసన సభ సక్రమంగా వ్యవహరించుటకు రెండు, మూడు వందల ప్రజకు ప్రాతినిధ్యము వహించు పది, పదిహేనుగురు ప్రతినిధులచే నిర్మించబడి ఉండవలెను. ఇట్లు లెక్కించినచో ఒక్కొక్క శాసన సభ క్రింద మూడు, నాలుగు వేల జనాభా ఉండగలదు. అనగా దరిదాపున మూడు, నాలుగు వేల జనాభా గల ప్రదేశము గ్రామ రాజ్య విధానమునకు తగిన గ్రామము.

# 7

# గ్రామ రాజ్య విధానము

## కుటుంబము

గ్రామములు, పట్టణములు, దేశములు పేరిట నేడు గుంపులు గుంపులుగా చేరియున్న ఈప్రజలో సత్యము, సహానము,

సమానత్వములను ప్రవేశపెట్టి అందరికి అన్న వస్త్రములు, స్వేచ్ఛ లభింపచేయు సంఘ నిర్మాణమే గ్రామరాజ్యముయొక్క ఉద్దేశ్యము. ఇప్పుడు సంఘ నిర్మాణము కుటుంబమునకే పరిమితమైఉన్నది కనుక, కుటుంబనిర్మాణము ఎట్లున్నదో గ్రహిస్తే, గ్రామరాజ్య పిధానము ఎట్లుండవలెనో తెలియగలదు.

కుటుంబ నిర్మాణములో రెండు విషయములు స్పష్టంగా కనుపించుచున్నవి. (1) వ్యక్తిగత ఆస్తి నిర్మూలించి, ఆస్తియంతా కుటుంబపరమగుట, (2) కుటుంబ నిర్వహణలో (*management*) సర్వాంగీకారము.

కుటుంబము యొక్క ఆస్తి యంతా కుటుంబానికే చెంది ఉంటుంది. కుటుంబములోని పిన్నలు, పెద్దలు ఎవరి శక్తిసామర్థ్యాలుబట్టి వారు వేరు వేరు పనులుచేయుచూ కుటుంబాన్ని పోషిస్తారు. మొత్తము మీద ఉత్పత్తి అయిన సంపదను అందరు సమభాగులుగా అనుభవిస్తారు. తమ అవకాశాలనుబట్టి ఇతర కుటుంబాలకు కూడా సహాయము చేస్తారు. ఆస్తి అంతా కుటుంబానికి చెంది ఉండుటచేతనే వారిలో సౌఖ్యము ఉంది. అట్లుకాకుండా తల్లికి, తండ్రికి, కొడుకులకు, కూతుళ్లకు అల్లుళ్ళకు, కోడళ్లకు, ఎవరి ఆస్తి వారికే ఉంటే, వారి వారి ఆస్తులను పోషించుకొనుటకు పోటీ పడి స్వార్థులయ్యేవారు. అప్పుడు వారికెవ్వరికి సౌఖ్యము లభించేది కాదు.

ఇక కుటుంబ నిర్వహణలో నలుగురు కూర్చొని, సంప్రదించుకొని కుటుంబ సమస్యలపై అంగీకారానికి వస్తారు. కుటుంబ యజమాని సలహాపై హెచ్చు గౌరవమున్నప్పటికి, ఒకరి కొకరు నచ్చ చెప్పుకొనుట, సహకరించుకొనుట,పరస్పర

త్యాగము, సోమరులను మందలించుట వలన అందరూ స్వేచ్ఛను అనుభవిస్తూ ఉంటారు. ఇట్టి సర్వాంగీకార పద్ధతి వలన కుటుంబములో సఖ్యత ఏర్పడుతుంది.

కుటుంబములు చక్కని సంఘము లయినప్పటికి, నాగరికతాభివృద్ధి వలన ప్రజల కోర్కెలు పెరిగి వాటిని నెరవేర్చుటకు కుటుంబము యొక్క శక్తి సామర్థ్యములు చాలకున్నవి. నాగరికత భారమును మోయలేక కుటుంబములు చితికి పోతున్నవి. అందుచేత కుటుంబ పరిమితులను దాటించి సంఘ నిర్మాణమును విస్తృత పరచ వలసి యున్నది. ఆవిస్తరణలో కూడ సమిష్టి ఆస్తి, సర్వాంగీకారము అను రెండు సూత్రములను పాటించవలెను కదా? కాని నేటి ప్రజా చైతన్య స్థితిలో లక్షల కొలదిజనము దేశముల పేరిట చేర్చినట్లయితే సమిష్టిఆస్తి సర్వాంగీకారము నెరవేర లేదు. మీదుమిక్కిలి ధనిక తత్వము, నియంతృత్వము ప్రబలుతున్నది. అందుచేత ఇటు కుటుంబ సంకుచితతను, అటు దేశముల ఆర్థిక, రాజకీయ నియంతృత్వములను విడనాడి, నాగరికతాభివృద్ధికి సరిపోవు సంఘనిర్మాణ చేయవలెనంటే నేడు గ్రామరాజ్యమే అనువగు పద్ధతి.

## గ్రామము - ప్రపంచము

నిరాఘాటంగా నాగరికత వృద్ధిపొందవలెనంటే ప్రపంచ ప్రజలందరు సంఘములో సహకరించుకొంటూ కృషిచేయవలెను. వసుధైక కుటుంబము అను ఆశయమునకు సర్వమానవ సంఘనిర్మాణము ఆధారము. వసుధైక కుటుంబము ఏర్పడవలెనంటే అందరిలోను పూర్తిగా సత్యము, సహనము, సమాన

త్వముల దృష్టులు వ్యాపించియుండవలెను కాని ధనికతత్వము, రాజకీయ నియంతృత్వములలోనుంచి బయటపడుచున్న ఈ నాగరికతాదశలో, అందరి ప్రజలలోను అంత సాంఘిక చైతన్యము వెంటనేఆశించలేము. మరియు సంఘదృష్టిని పెంపొందించుటకై ఇప్పుడు కుటుంబము అతి చిన్నదిగాను, దేశము అతి పెద్దదిగాను ఉన్నవి. అందుచేత సర్వమానవ సంఘము ఏర్పడ్చుటకై గ్రామరాజ్య గ్రామమును ప్రస్తుతము ప్రాతిపదికగా తీసుకుంటున్నాము.

## నిర్వహణ

గ్రామ రాజ్య గ్రామమందు సమస్యలపై సంప్రదించుకొనుటకు గ్రామస్థులందరు కూడుచుండుటే ఆదర్శప్రాయంగా ఉంటుంది. అప్పుడు కుటుంబములోని సర్వజనాంగీకార పద్ధతి అమలు జరుగుతుంది. గ్రామ జనాభా మూడు, నాలుగు వేల వరకే ఉండుటచేత, ఇట్టి సంప్రతింపులూ, సర్వసమ్మతి పరిష్కారములూ కష్టతరము కాదు. గ్రామస్థుల నిర్ణయములను అమలు జరుపుటకై ఎప్పటికప్పుడు చిన్న ఉపసంఘములను (*ad hoc committes*) ఏర్పరచు కొనవచ్చు. నిర్ణయింపబడిన పని నెరవేరిన తరువాత ఆ కమిటీ రద్దయిపోతుంది. ఇంకొక పనికి ఆ పనియందు శక్తి సామర్థ్యములుకల వ్యక్తులతో మరొకసంఘమును ఏర్పరచుకోవచ్చు.

కొన్ని సంవత్సరములు స్థిరముగా ఒక గ్రామ సభను ఏర్పరచుకొని, అన్ని పనులు ఆ సభకే వప్పగించుట కంటె, ఎప్పటి కప్పుడు ఉప సంఘముల నియామకముతో ప్రత్యేక

లాభములున్నవి. స్థిరమగు గ్రామసభను ఎన్నుకున్నట్లయితే గ్రామస్తులు అంతకంతకు ప్రతి పనిని గ్రామసభకు వదలివేయుచుందురు. దీని వలన ఒకవైపు ప్రజలలో సంఘ నిర్వాహణ యెడల బాధ్యతారాహిత్యము, రెండవ వైపు గ్రామసభ సభ్యులలో నిరంకుశత ఏర్పడుతుంది. ఇది సంఘ చైతన్యాభివృద్ధికి దోహదమివ్వదు. అందుచేత ప్రజలనందరిని ప్రతి విషయము మీద ఆలోచింపచేసి నిర్ణయముల్లో సమభాగులనుచేయు పద్ధతినే ప్రోత్సహించవలెను. ఇందుకై గ్రామస్తులందరు మాటిమాటికిసమావేశమగుటను సాంప్రదాయముగా ఏర్పరుట మంచిది.

మరియు ఒక స్థిరమగు ప్రతినిధి సభ ఉంటే అందులోని సభ్యులు ప్రతి విషయమును నిర్వహించుటకు తగిన శక్తి సామర్థ్యములు కలవారై యుండలేరు. అందుచేత ఏ కార్యమునకు ఆ కార్యము నెరవేర్చుటకై ఉపసంఘములను ఏర్పరచినట్లయితే ఆ పని యందు అభిరుచి, శక్తి సామర్థ్యములుగల గ్రామస్తులు ఆ ఉపసంఘములో పాల్గొనవచ్చు. ఇట్లు ఆ ఉపసంఘ నియామకమే ఉత్తమైంది.

గ్రామరాజ్యము యొక్క ఆదర్శము ప్రజలందరిలోను సంఘదృష్టిని పెంపొందించుటే కనుక దానికి తగిన నిర్వాహణ పద్ధతులనే అవలంబించవలెను. సర్వసమ్మతి విధానము, ఉపసంఘ నియామకము ఇందువలన తగినవి. కాని ఒక వైపున ఆ పద్ధతులను అవలంబించుతూ రెండవ వైపున కుటుంబ యజమానివలె గ్రామమునంతటిని సఖ్యతగా ఉంచుటకై పది, పదిహేనుగురు సభ్యులుకల గ్రామసంఘమును కూడ ఏర్పరిచి ఉం

చుట మంచిది. పనులు విశేషమునా ఉపసంఘముల ద్వారానే జరుగుతున్నప్పటికి, ఈగ్రామసంఘం గ్రామ పెద్దగా ఉంటుంది.

## ఆర్థిక వ్యవస్థ

నిర్వహణలో సర్వసమ్మతి విధానమును నుసరించు చున్నట్లే, ఆర్థిక వ్యవస్థలో గ్రామములు సమిష్టి ఆస్తి విధానమును అనుసరిస్తాయి. అనగా ఇప్పుడు ఆస్తులపై కుటుంబములకున్న యాజమాన్యము గ్రామమునకు మారుతుంది. కుటుంబములో వ్యక్తులకున్న స్థానము రేపు గ్రామములో కుటుంబానికి వస్తుంది.

సమిష్టి అయిన ఆస్తిని మరల సర్వసమ్మతిపైన గ్రామ కుటుంబాలన్నీ వాటి వాటి అవసరాలు, శక్తి సామర్థ్యాలుబట్టి తిరిగి పంచుకొని సంపదను ఉత్పత్తి చేస్తాయి. కుటుంబముల సంఖ్య మార్పు, ఆస్తి రూపములలో మార్పుబట్టి సంవత్సరమున కొకసారో, నాలుగైదు సంవత్సరముల కొకసారో ఆస్తులను తిరిగి తిరిగి పంచుకొనవచ్చును. మరియు సంఘచైతన్యము పెరుగుచున్నకొద్దీ ఆస్తిని పంచుకొనకుండ గ్రామమంత ఒకే కుటుంబముగా వ్యవహరించి ఆస్తియంతయును సమిష్టిగానే ఉత్పత్తికి వినియోగించవచ్చు. అప్పుడు ఉత్పత్తిని అనుభవించుటలో అందరు సమభాగులు కావచ్చు.

## మార్పు

వ్యక్తిగత ఆస్తికి, రాజకీయ నియంతృత్వానికి అలవాటు పడియున్నవారు సర్వసమ్మతి, సమిష్టి ఆస్తి విధానముల పైకు

మారుట సంభవమా అని తోచవచ్చు. కాని మన ఆర్థిక, రాజకీయ సమస్యలు పరిష్కరించబడి, అందరికి అన్నవస్త్రములు, స్వేచ్ఛ చేకూరుటకు గ్రామరాజ్యమే మార్గమైనప్పుడు నేటి విధానములను గ్రామరాజ్యము వైపు మార్చుటను పూనుకొనవలెను. ఇది కష్టసాధ్యము కాదు. మానవులలో కొందరు అస్పృశ్యులని నమ్మించి కోట్ల కొలది జనమును దూరముగా ఉంచుట సంభవమైనప్పుడు అందరిని సమముచేసి సౌఖ్యమువైపు తీసుకువెళ్లుట ఎందుకు సంభవము కాదు. ఇది ఇంకా సులభము కదా?

ఇటువంటి మార్పు సమాజములో వచ్చినప్పుడు నేటి గ్రామములకు గ్రామరాజ్యములోని గ్రామములకు చాలా వ్యత్యాసము ఉంటుంది. ఈ గ్రామములు కూడా మూడు, నాలుగు వేల జనాభా కలిగి యుండుటచేత ఇవే గ్రామరాజ్య గ్రామములుగా వ్యవహరించవచ్చు. కాని ఆర్థిక, రాజకీయ విధానములలో రెండింటికి చాలా తేడా ఉన్నది. నేటి గ్రామ పంచాయితీలకు పెద్ద హక్కులు బాధ్యతలూ లేవు. తాలూకాల నుంచీ, జిల్లాల నుంచీ, వచ్చిన తాకీదులను ఇవి అమలు పరుస్తున్నాయి. కాని గ్రామరాజ్య గ్రామములు సర్వాధికారము కలిగి ఉంటాయి. వాటి నిర్ణయములను అవి అమలుపరుచుకోవచ్చు. అవి పొరపాటుచేస్తే, ఆ నష్టమును అవే అనుభవించి తరువాత సరిదిద్దుకుంటాయి. ఉదాహరణకు కొందరి సోమరితనము వలన గ్రామము నష్టపోతుంది కనుక అట్టి సోమరులను ఇతర గ్రామస్తులు అదుపాజ్ఞలలో పెట్టి మందలిస్తారు. మానవులు అభివృద్ధి పొందుటకు అనుభవమే మార్గము. ఆలోచనకు

లొంగనివి అనుభవానికి లొంగుతవి సామాన్య ప్రజ తప్పు చేస్తారేమోనని నియంతృత్వములలో పోషిస్తూఉంటే, ప్రజ ఎప్పుడూ పసితనములోనే ఉంటారు. వారిని బాధ్యులుగా చేయుటచేతనే వారు పౌరులుగా మారగలరు.

రక్త సంబంధ బంధుత్వమున్నప్పుడే వారిని కుటుంబములో సమభాగులను చేసుకొనుటకు నేడు ప్రజ అలవాటు పడియున్నారు. గ్రామరాజ్య విధానములో రక్తసంబంధముకన్న సంఘ సంబంధము ముఖ్యమవుతుంది. ఉదాహరణకు ఇవాళ్ల వరకు నిర్లక్ష్యము చేయబడుచున్న పౌరుగింటివారితో రేపు వివాహ సంబంధము కలుపుకోగానే వారిని ఇక మీదట ఆత్మబంధువులుగా చూచుటకు అలవాటు పడినాము. ఈ అలవాటును మార్చి అందరిని సంఘ దృష్టిలో సమముగా చూచి సహకరించుట గ్రామరాజ్య విధానము అలవాటు చేస్తుంది.

### రీకాల్, రిఫరెండమ్, ఇనీషియేటివ్

నేటి ప్రజాస్వామికములో నియోజకవర్గములు చాలా పెద్దవగుటచేత ప్రజలకు, ప్రతినిధులకు సన్నిహిత సంబంధము లేదు కనుక ప్రభుత్వాలు స్వార్థములోనికి, నియంతృత్వములోనికి దిగజారిపోతున్నవి, దీనిని సరిదిద్దుటకై రీకాల్, ఇనీషియేటివ్, రిఫరెండమ్(*recall, initiative, referendum*) అను పద్ధతులను ప్రజాస్వామికములో ప్రవేశపెట్టుతున్నారు. రీకాల్ అనగా ఎన్నుకొనబడిన ప్రతినిధి అసమర్థుడని తోచినప్పుడు అతని ప్రాతినిధ్యగడువులోపుగానే మరల ప్రజల ఓటుతో పదభ్రష్టుని చేయుట. తరువాత ఆ స్థానమునకు మరొకరిని ఎన్ను

కుంటారు. ఇనీషియేటివ్ అనగా శాసన సభ్యుల ద్వారానే గాక ప్రజలు కూడా తీర్మానములను సూటిగా శాసనసభలో ప్రవేశపెట్టు అవకాశము. రిఫరెండము అనగా శాసనసభ్యులు ఓటు వేసి శాసనము చేయుటకు బదులు కొన్ని శాసనములపై ప్రజల ఓటును తీసుకొనుట. ప్రజలకు, ప్రభుత్వమునకు సన్నిహిత సంబంధము ఏర్పరచుటకు పై మూడు విధములు చాల వరకు తోడ్పడుతవి. కాని గ్రామరాజ్యమందు విశేషముగా గ్రామ ప్రజలే గ్రామ శాసనములు చేయుటకు పాల్గొంటారు కనుక చక్కని ప్రజాస్వామ్యమును అమలు జరుగును. రీకాల్, రిఫరెండము, ఇనీషియేటివ్ కంటె ఇదే ఉత్తమమైన పద్ధతి.

## రాజకీయ పార్టీలు

నేటి ప్రభుత్వములు ప్రజలపై పెత్తనములు చేయుటకే గాని ప్రజల యోగక్షేమములందు శ్రద్ధ వహించుటకు పనికి వచ్చుటలేదు. అవి ప్రజాస్వామికములు అయినప్పటికి నియోజక వర్గములు పెద్దవగుట చేత ప్రజలతో సన్నిహిత సంబంధమును కలిగిలేవు. రాజకీయ చైతన్యంతో ప్రజలు ఓటును వినియోగించుటలేదు. అందుచేత కొంత మంది రాజకీయచైతన్యము కల్గిన వ్యక్తులు సముద్దేశ్యముతోనే రాజకీయపార్టీగా ఏర్పడి ప్రభుత్వమునకుప్రజలకుమధ్య దళారీలుగా వ్యవహరిస్తున్నారు. వేరు వేరు సదుద్దేశ్యములతోనే వేరు వేరు రాజకీయ పార్టీలు ఏర్పడుతున్నాయి. అయితే ఆ సముద్దేశ్యము నెరవేరుటకు తమకు ప్రభుత్వాధికారము సంక్రమించవలయునని ప్రతి రాజకీయ పార్టీ సిద్ధాంతము. అందుచేత ప్రజాసేవకంటే ప్రభుత్వా

ధికారము చేజిక్కించుకొనుటకు ప్రయత్నించుటే రాజకీయ పార్టీల ప్రధమ కార్యక్రమము. అధికారముకై వారి పడుపోటీలలో ప్రజాసేవ వెనుకపడిపోతుంది.

మరియు ప్రభుత్వాధికారముద్వారానే ప్రజాసేవ చేయగలమని అనుకొనుటచేత ఈ రాజకీయ పార్టీలు ప్రభుత్వమును బలపరుచుటకే చూస్తున్నవి కాని ప్రజలకు పరిపాలనాధికారమును సంక్రమింప చేయుటకు ప్రయత్నించరు. నిజమునకు పరిపాలనా బాధ్యత తిన్నగా ప్రజలకు ఎంతవరకువస్తే, అంత వరకు ప్రజాస్వామికము సక్రమంగా ఉంటుంది. అందుచేత ఈ రాజకీయ పార్టీలు సక్రమప్రజాస్వామ్య నిర్వహణకు తోడ్పడుట లేదు. సక్రమ ప్రజాస్వామికము గ్రామరాజ్య విధానము వలననే వస్తుంది. ఇందు గ్రామస్తులు సూటిగా తమ గ్రామ వ్యవహారాలలో పాల్గొంటారు కనుక రాజకీయ పార్టీలకు స్థానము లేదు.

## విశాల సంఘము

గ్రామరాజ్యమనగా గ్రామానికే పరిమితికాదని, స్వపరిపాలనగల గ్రామముల ప్రాతిపదికలో నిర్మింపబడు వసుధైక కుటుంబ సంఘ దృష్టని చెప్పి యున్నాము. అందుచేత గ్రామముల నుంచి వసుధైక కుటుంబ స్థితికిగల దశలను పరిశీలించాలి.

మానవునిలో నీతి ప్రవర్తన పెరుగుతున్నకొద్దీ, గ్రామ పరిమితి మూడు, నాలుగు వేల జనాభాను దాటి పోవచ్చు. ప్రస్తుతము ఆ జనాభా అనుకూలము. ఇట్టి గ్రామములు తమ ఆర్థిక, రాజకీయ వ్యవహారములను. ముఖ్యాతిక మూడు పాళ్లు

అవే చక్కబెట్టుకుంటాయి. కాని నాగరికతాభివృద్ధి చెందుటకు మానవుని శక్తి సామర్థ్యములూ, కోరికలూ గ్రామమునకు పరిమితి చెందించక, విశాల మానవ సంఘము వైపు పురోగమింప చేయాలి. అందుచేత గ్రామరాజ్య విధానములో గ్రామమునకొక ప్రతినిధి చొప్పున పది, పదిహేను ప్రక్క ప్రక్క గ్రామములు కలసి ఫిర్కా సంఘములు ఏర్పడుతాయి. అలాగే పది, పదిహేను ఫిర్కాలుకలసి జిల్లా సంఘాలు, పది, పదిహేను జిల్లాలు కలసి రాష్ట్రాలు, తరువాత దేశాలు, ప్రపంచ సంఘముల వరకు ఇదే రీతిగా వేరు వేరు సంఘాలు ఏర్పరచవచ్చు. గ్రామసంఘము గ్రామస్థుల అవసరాలను చాలాభాగము తీరుస్తాయి. ఇతర సంఘాలు సమిష్టిఅవసరాలను వాటి వాటి స్థాయి బట్టి నెరవేరుస్తాయి. ఉదాహరణకు ఉన్నత విద్యను ఫిర్కా సంఘములు, రహదార్లను జిల్లా సంఘములు, వస్తు మార్పిడిని రాష్ట్ర సంఘములు, రైలు మార్గములను దేశసంఘములు ఇట్లు ఏ స్థాయికా స్థాయిలో అవసరమగు సమిష్టి పనులను ఆ యా సంఘములు నెరవేర్చును. అందుచేత మానవుని సమదృష్టి గ్రామమునకూ, ప్రాంతమునకూ, దేశమునకూ, సంకుచితమై పోక, ప్రపంచదృష్టి వైపు ప్రసరిస్తుంది. వసుధైక కుటుంబములో తన గ్రామము యొక్క పాత్రను గురించి ఆలోచించుతాడు.

పై సంఘములకు ఎన్నికగువారు వరుసగా దిగువ సంఘములలో ఎన్నికై ఉండవలయును. కనుక ఇన్ని వడపోతలలో నుంచి వెళ్లినప్పుడు, స మి ష్టి సంఘములకు ఎన్నుకొనబడినవారు నిస్సందేహముగా సమర్థులు, అనుభవజ్ఞులై ఉంటారు.

విశాలమగు ఇట్టి గ్రామరాజ్య విధానములో వసుధైక కుటుంబ దృష్టితప్ప, సంకుచిత జాతీయ సృష్టి ఉండదు.

యు ద్ధ ము - జ నా భా

గ్రామరాజ్య విధానము దేశ సరిహద్దులను దాటి పోవుట చేత ఈనాడు దేశముల మధ్యగల యుద్ధ వాతావరణమునకు, వస్తు మార్పిడికి గల అడ్డంకులకు తావు లేవు. మరియు ఈనాడు ఈ సంకుచిత జాతీయదృష్టి వలన కొన్ని దేశములలో జనాభా అతిఒత్తిడిగాను, మరికొన్ని దేశములలో జనాభా అతి పలుచగాను ఉన్నది. ఆర్థిక ఎక్కువ తక్కువల రీతిగానే జనాభాల ఎక్కువ తక్కువ ఒత్తిడి వల్ల రకరకాలయిన ఆరోగ్య సమస్యలు, ఆహార సమస్యలు బయలు దేరుతున్నాయి. దేశ సరిహద్దులు దాటి వసుధైక కుటుంబ దృష్టి ఏర్పడుట వలన గ్రామరాజ్య విధానమందు జనాభాలు ఇటు అటు సర్దుకొని ఈ సమస్యలను పరిష్కరిస్తాయి.

ప న్ను లు

గ్రామరాజ్యములోని సమిష్టి సంవిభాగము వలన పన్నులు అను మాటకు అర్థము మారిపోతుంది. ఏ గ్రామము మట్టుకు ఆ గ్రామము పనులు చేసుకొనుటకు అక్కడ ప్రజలే శ్రద్ధ వహిస్తారు. వారు వారి దీక్షకు ప్రేరణ డబ్బుకాదు సంఘ సౌభాగ్యమే వారికి ప్రేరణ నిస్తుంది. ఇట్లు పనులు చేసుకొంటు న్నప్పుడు ధనమునకు వస్తు మార్పిడి విలువ తప్ప ఇంకొకటి ఉండదు. అటువంటప్పుడు ఆస్తి అంతా గ్రామానికి చెంది ఉండి

సమిష్టి సంఘములను పోషించుట కొరకే కొన్ని కొన్ని పన్నులను వస్తు రూపేణాగానో. లేక ధన రూపేణాగానో ఇవ్వవలసి ఉంటుంది.

# 8

# పట్టణములు - పరిశ్రమలు

## పట్టణములు

మానవుని సౌఖ్యాభివృద్ధికి, శక్తి సామర్థ్యాభివృద్ధికి పట్టణములు పరిశ్రమలు స్థానములుగా కనబడతాయి. నిజానికి పట్టణములు చూస్తే ఎన్నో వినోదములు, విద్యా, వైద్య, మార్గ సౌకర్యములు, నాగరికతా చిహ్నములు అక్కడ కనబడతాయి. విశాల సంఘ దృష్టిలో చూచినట్లయితే పట్టణాభివృద్ధిలో మానవ స్వార్థ మున్నది. తోటి మానవులు గుడిశల్లో కుములుతూ ఉండగా. ఒక ధనికుడు భవనాన్ని నిర్మించుకొని భోగభాగ్యాలు అనుభవించుటలో ఎలాగ స్వార్థమున్నదో, అలాగే మార్గములు, విద్యా, వైద్య సౌకర్యములు లేకుండా ఎన్నో పల్లెటూళ్లు బాధపడుతూ ఉంటే, పట్టణములు ఇట్లు వృద్ధి పొందుట స్వార్థదృష్టి. నేటి నాగరికతలో స్వార్థము పెంపొందింది కనుక దానికి అనుగుణ్యముగానే పట్టణాలు కూడా పెరిగినాయి.

గ్రామరాజ్య విధానమందు సమానత్వ దృష్టి పెంపొందినప్పుడు పట్టణములకు, పల్లెటూళ్లకుఉన్న తేడా క్షీణించి అంత

కంతకు అన్నీ కూడా మూడు, నాలుగు వేల జనాభా గల గ్రామాలుగా ఏర్పడుతవి. మరియు నేటి పట్టణములలోని ప్రజ గుంపులు గూడి ఉన్నారే కాని వారిలో సత్యము, సహనము, సమానత్వము కొఱతపడి ఎన్నో రకముల మోసములు, దోపిడీలు చెలరేగుతున్నవి. వీటిని అరికట్టి నీతిని పెంపొందించ వలెనంటే గ్రామరాజ్యమే కావలెను.

### పరిశ్రమలు

పట్టణముల వలెనే పరిశ్రమలు కూడ ఈ నాగరికతలోని స్వార్థ దృష్టిని అనుసరించి అభివృద్ధి పొందినవి. పనిముట్లే అంతకంతకు అభివృద్ధి చెంది యంత్ర పరిశ్రమలు అయినవి. కాని ఈ నాగరికత ధనికతత్వము, నియంతృత్వము దారిపట్టుటచేత వీటికి అనుగుణముగానే పరిశ్రమలు గూడా వృద్ధి పొందుతూ వచ్చాయి. రేడియోలు, విమానములు వంటి యంత్రములు నాగరికతాభివృద్ధి లక్షణములేకాని, అవి ఏ కొద్ది మంది ధనికులో అనుభవిస్తున్నారు. అణుశక్తిని కనిపెట్టుట వైజ్ఞానికాభివృద్ధి లక్షణమేకాని ఈ విజ్ఞానము నియంతృత్వపు దారిపోయినదని చూపించుటకు దానిని బాంబు నిర్మాణమునకు వినియోగించుటే తార్కాణము,

### యదార్థము

పరిశ్రమల వలన ఉత్పత్తియగు వస్తువులు చౌకగాను, అధికముగాను ఉండునని నమ్ముట ఒక భ్రాంతి. మిల్లు నిర్మించుటకు పెట్టిన పెట్టుబడికంటే, ఆ మిల్లు నడచుటకు కావలసిన రైలు

మార్గములు, ఆరోగ్య నివాసములు, బ్యాంకులు, బజార్లు నిర్మించుటకు ప్రభుత్వము ఎంతో ఖర్చుపెట్టుచున్నది. ప్రజాసామాన్యమునుంచి వసూలు చేసిన పన్నులను ప్రజాసామాన్య సౌకర్యములకు వినియోగించకుండా, కాకులను కొట్టి గద్దలకు వేసినట్లుగా అధిక భాగము పరిశ్రమల సౌకర్యముల కొరకే ప్రభుత్వము వినియోగిస్తున్నది. ఈ ఖర్చులుతో కూడ కలిపి చూచినట్లయితే చేతితో తయారు చేసిన వస్తువుల కంటె మిల్లులో తయారు చేసిన వస్తువులు హెచ్చు ఖరీదు అవుతాయని శ్రీ జె. సి. కుమారప్ప గారు స్పష్టముగా ఋజువు చేసియున్నారు. గ్రామములలోని ముడి పదార్థములను గ్రామపరిశ్రమలద్వారా వస్తువులు తయారు చేసుకుంటె రవాణా ఖర్చులు తగ్గి, చాలా చౌకగా లభిస్తాయి.

మిల్లుల వల్ల అధికముగా వస్తువులు ఉత్పత్తి అవుతాయని అనుకోవడము కూడా పొరపాటు. ఒక మిల్లులో వంద మంది పని చేసి ఉత్పత్తి చేసిన దానికంటె వేలు, లక్షలమంది ప్రజ తమ తమ గ్రామములలో ఉత్పత్తి చేసిన వస్తువుల పరిమాణము ఎన్నోరెట్లు అధికము. నేటి ధనిక, నియంతృత్వ విధానములు మిల్లులను పెంచి చేతి పరిశ్రమలను అణచుటచేత, నిరుద్యోగము పెరిగి ఉత్పత్తి తగ్గింది. గ్రామ పరిశ్రమలను పునరుద్ధరించినట్లయితే, ఉత్పత్తి పెరిగి, నిరుద్యోగం నశిస్తుంది.

ఇట్లు గ్రామరాజ్య విధానమందు పరిశ్రమల రూపము మిల్లు నుండి చేతిపనులవైపు మారితే, వైజ్ఞానికులు కూడా ఈ నూతన దృష్టికి అనుగుణంగానే యంత్రములను తయారు చేస్తారు. అప్పుడు విజ్ఞానము యొక్క పోకడ సంఘ దృష్టివైపు

మరలునే కాని, అభివృద్ధి తగ్గదు,

కుటీర పరిశ్రమల ద్వారా చాలా వస్తువులు హెచ్చు గాను, చౌకగాను తయారైనా, కొన్ని నాగరికతావసరాలు చేతితో తయారు చేయలేము. ఉదాహరణకు కుట్టు యంత్రం, తైపు మిషను, రైళ్లు నిర్మించుటకు, గనులు త్రవ్వుటకు పెద్ద యంత్ర సహాయం కావాలి. వీటి ఉపయోగమునకు గ్రామ రాజ్యం అంగీకరిస్తుంది. కాని ఏది చేసినా అందులో సంఘ దృష్టి మాత్రం ముఖ్యం. ఒకరి పని ఇంకొకరి సౌఖ్యానికి అడ్డుపడరాదు.

# 9

# మార్గము

## సాధనశుద్ధి

ప్రభుత్వ రహిత సమాజమును నిర్మించుటకై నియంతృత్వ విధానమును అవలంబించి మార్క్సిజము విఫలమైంది. అందుచేత ఆశయమును సాధించవలెనంటే ఆశయము వైపు పోవు మార్గముననే వెళ్లవలెను. గ్రామరాజ్యము యొక్క ఆశయము సమానత్వమును, స్వేచ్ఛను సాధించుట కనుక, మన మార్గము కూడా ఈ రెండు గుణములు కలిగియుండ వలెను. ఆశయమునకు, విధానమునకు సమన్వయ ముండుటే గాంధీ పద్ధతిలోని విశిష్టత. గాంధీ పద్ధతి ననుసరించునట్టి భూదానోద్యమము కూడా ఈ విశిష్టతనే కలిగి యున్నవి.

ఇప్పుడు ధనికతత్వము వలన ఆర్థికఅసమానతలు ఏర్పడి ఉన్నాయి. దీనిని సమానత్వము వైపు తీసుక వెళ్లుటకు నిరంకుశ ప్రభుత్వ నిర్బంధమును వినియోగించవచ్చు. కాని ఆ విధానమందు స్వేచ్ఛ లేదు. నిర్బంధము వలన సాధించిన సమానత్వము మరొక నిర్బంధము వలన మారి పోవచ్చు. అందుచేత స్వేచ్ఛతోనే సమానత్వమును సాధించినట్లయితే అది స్థిరముగా ఉంటుంది. ఈ ఉద్దేశ్యముతో భూదానోద్యమము స్వేచ్ఛతో సమానత్వము సాధించు కార్యక్రమము నిర్ణయించుకొన్నది.

### ధ ని క త త్వ ము - స మా న త్వ ము

నేడు ధనికతత్వము ప్రజలలో ప్రచారమై యున్నది. అందుచేత ప్రజల వ్యక్తిగతఆస్తిని గౌరవిస్తున్నారు. ఈ ధనికతత్వము ఒక్క ధనికులలోనే లేదు. ఇది ప్రజలందరిలోను సామాన్యముగా వ్యాపించియున్నది. లక్షాధికారికి తన లక్షలపైన ఎంత అభిమానమున్నదో, భిక్షాధికారికి తన భిక్షాపాత్రమీద కూడా అంత అభిమానమున్నది. వ్యక్తిగతఆస్తిపై అభిమానమునకు సంబంధించినంతవరకు ధనికుడైనా, పేదవాడైనా ఒక్కటే. వ్యక్తిగత ఆస్తి సంపాదన పోటీలో నెగ్గినవాడు ధనికుడుగా ఉన్నాడు. ఓడి పోవుచున్నవాడు పేదవాడుగా ఉన్నాడు. ఆస్తి సంపాదనకై పోటీ పడుటలో ఇద్దరు ఒక్కటే. ఈ పోటీలో ధనికుడిని చూచి పేదవాడు ఈర్ష్య పడుతున్నాడే కాని ద్వేషించుట లేదు. ద్వేషము లేకపోవుటవలన మార్క్సు ఊహించిన వర్గ పోరాట విధానము నెగ్గలేదు. ధనికతత్వము

వలన అసమానతలు ఏర్పడినవి. కనుక, అసమానతలను తీసివేయ వలెనంటే ప్రజలందరిలో వ్యాపించియున్న వ్యక్తిగత ఆస్తిపై అభిమానమును మార్చివేసి సమిష్టి ఆస్తిపై అభిమానమును కలిగించవలెను. అనగా ధనికతత్వదృష్టిని సమానత్వమువైపుకు మార్చవలెను. ప్రజాసామాన్యపు దృష్టిలో కలిగించు ఈ మార్పునే జనశక్తి నిర్మాణమని వినోబాగారు అంటారు. జన శక్తి అనగా క్రియాత్మకమగు, బలమయిన ప్రజాభిప్రాయము.

జ న శ క్తి

జనశక్తి నిర్మాణమునకు రెండు ముఖ్యమయిన లాభా లున్నాయి.

ప్రభుత్వ శాసనము ద్వారా సమానత్వము సాధించ వలె నంటె ప్రభుత్వాధికారములో ఉన్న వారికి సమానత్వ సాధన యెడల దీక్ష ఉండాలి. ప్రజాస్వామిక విధానమందు జన సామాన్యములో సమానత్వముపై అభిమానముంటేనే తప్ప అటువంటి ప్రతినిధులు ఎన్నికై, సమానత్వమందు అభి మానము గల ప్రభుత్వము ఏర్పడదు. అందుచేత ప్రజాస్వా మిక ప్రభుత్వము ద్వారా సమానత్వము సాధించుటకై సమా నత్వ దృష్టి గల జనశక్తి ఏర్పడవలెను. జనశక్తి లేనప్పుడు సమానత దృష్టిగల రాజకీయపార్టీ నియంతృత్వాధి కారమును చేచిక్కించు కొనవలెను. నియంతృత్వము మానవ స్వేచ్ఛకు వ్యతిరేకము. కనుక, ప్రజా ప్రభుత్వము ద్వారా సమానత్వము సాధించుటకై సమానత్వమునకు అనుకూలమగు జనశక్తి కావ లెను. జనశక్తికి ఇది మొదటి ఉపయోగము.

రెండవ ఉపయోగము లోకనీతిని తయారు చేయుట. ఏ ప్రభుత్వమైనప్పటికి ఎంతోకొంత నిర్బంధముతప్పదు. నియంతృత్వములో నిర్బంధము అధికముగా ఉంటుంది. ప్రభుత్వము ఎంత ప్రజాస్వామికమయితే అంత నిర్బంధము తగ్గుతుంది. అందుచేత మార్క్సు ఊహించిన ప్రభుత్వ రహిత సమాజము ఏర్పడవలెనంటే, సమానత్వమున కనుకూలమగు జనశక్తి బాగా బలపడాలి. అప్పుడు శాసన రహిత లోకనీతి ద్వారా సమానత్వమును ప్రజలే పోషించుకుంటారు.

## భూ దా న ము

భూదాన కార్యక్రమము జనశక్తి విధానాన్ని అనుసరిస్తుంది. అనగా ప్రజలతో వ్యక్తిగత ఆస్తికి వ్యతిరేకంగా, సమిష్టి ఆస్తికి అనుకూలంగా ప్రచారం చేస్తుంది. ఈ నూతన చైతన్యము వ్యాపించుకొద్దీ, దీనికి అనుకూలురు వారి వారి వ్యక్తిగత ఆస్తులను వదలి వేస్తుంటారు. ఆస్తి చాల రూపములలో ఉంటుంది. భూమి, శ్రమ, సంపత్తి, బుద్ధి, సమయము ఇవన్ని ఆస్తి రూపములే. ఎవరి వీలుబట్టి వారు భూ, సంపత్తి, శ్రమ, బుద్ధి, సమయ దానములను చేస్తారు.

భూదానోద్యమ ప్రథమదశలలో ఈ దానములు కొద్ది కొద్దిగానే యుండవచ్చు. కాని జనశక్తి పెరుగుతున్నకొద్దీ ఆస్తిలో ఆరవ భాగము, అంతకంతకు పూర్తిగా కూడా ఇచ్చి వేయవచ్చు. మరియు సమానత్వము పూర్తిగా స్థాపింపబడే వరకు నేటి ధనికతత్వముక్రింద నలిగిపోతున్న పేదలు బాధపడవలసిన అవసరం లేకుండా, ఎప్పుడు, ఎక్కడ వచ్చిన దానములను

అప్పుడు అక్కడే వారికి పంచిపెట్టుతారు.

ఇట్లు భూదానోద్యమము వ్యాపిస్తూ ఉంటే ఒక వైపున ప్రజలు దృష్టిమారి స్వేచ్ఛతో తమ వ్యక్తిగత ఆస్తిని తాము వదలుకుంటారు, రెండవ వైపున నేః పేదలకు కొంత సహాయము కూడా వెంటనే లభిస్తుంది. ఈ వాతావరణము ఇట్లు పెరుగుతూ ఉంటే అంతకంతకు కొందరు ఆస్తులను పూర్తిగా వదలి వేస్తారు. ఏ ఏ ప్రాంతములలో అంత అస్తిని అందరు వదిలి వేస్తారో ఆప్రాంతములను గ్రామదానములంటారు. గ్రామదానములందు వ్యక్తిగత ఆస్తి పోయి ఆస్తి అంతా సమిష్టిగా గ్రామపరమవుతుంది. ఇట్లు భూదానోద్యమము వలన స్వేచ్ఛతో వ్యక్తిగత ఆస్తి నిర్మూలన నెరవేరుతుంది,

## క్రియాత్మకము (*positive*)

దానములకు గ్రామదానము అంతిమ రూపమైనప్పటికి ఇది భూదానోద్యమంలో ఒక భాగము మాత్రమే. అనగా ఇది వ్యక్తిగత ఆస్తిని నిర్మూలిస్తుంది. దేనినైనా నిర్మూలించుట అభావాత్మకము మాత్రమే (*negative*). దానికి సంబంధించిన నిర్మాణము రెండో వైపు క్రియాత్మకముగా (*positive*) జరుగువరకు ఆ ఉద్యమం పూర్తి కాదు. ఇంతవరకు మానవులు తమ పోషణకై వ్యక్తిగత ఆస్తిపై ఆధారపడి యున్నారు. దాని వలన నష్టములు కనపడ్డాయి కనుక దానిని వదలివేయవచ్చు. అయితే ఇకమీదట పోషణకై దేనిమీద ఆధారపడవలెనో సూచించవలెను. ఈ క్రియాత్మమగు నిర్మాణమే గ్రామ రాజ్యము. గ్రామరాజ్యమందు సమిష్టి ఆస్తి, గ్రామస్థుల ఆద

రాభిమానముల వలన వ్యక్తి రక్షణ లభిస్తుంది. అనగా వ్యక్తి గత ఆస్తికి ప్రత్యామ్నాయముగా సంఘాభిమానమును గ్రామ రాజ్యము ఇస్తుంది. అందుచేత గ్రామరాజ్య నిర్మాణమునకు తగు జనశక్తిని వృద్ధి చేయుటే స్వేచ్ఛతో సమానత్వమును సాధించుటకు మార్గము.

# 10

## కార్యక్రమము

ధనికతత్వము, రాజకీయ నియంతృత్వము ఆవరించి యున్న ఈ నాగరికతా స్థితిని గ్రామరాజ్య విధానము వైపు మార్చుటకు ఈ క్రింది కార్యక్రమమును దశదశలుగా అనుసరించవచ్చు. నూతన వాతావరణం వ్యాపించుతూ, గ్రామ రాజ్యమునకు అనుకూలంగా జనశక్తి బలపడుకొలదీ, కార్యక్రమములోని మొదటి దశలను వేగముగా దాటుకొనిపోయి చివరి దశలను అందుకొన వచ్చును.

(1) గ్రామరాజ్యము యొక్క క్రియాత్మక (*positive*) రూపమును సాహిత్యము, పాటలు, ఉపన్యాసములు, సంభాషణలు, శిక్షణ శిబిరములు, పాదయాత్రలు ద్వారా ప్రచారము చేయవలెను.

(2) గ్రామరాజ్యవిధానము మనసుకు నచ్చినవారితో ఏ గ్రామమునకు ఆ గ్రామంలోనే గ్రామరాజ్యసంఘం ఏర్పర్చవలెను. ప్రథమంలో ఒక్కొక్క చోట వీరు ఒకరో, ఇద్దరో

కొద్దిమందో యుండవచ్చు. వీరి ఆశయ దీక్ష బట్టి సంఖ్య పెరుగుతుంది. పట్టణము, పల్లెలు అను తేడా లేకుండా అంతకంతకు అన్ని చోట్లా గ్రామరాజ్యం వ్యాపించాలి కనుక, గ్రామ రాజ్య సంఘములు పల్లెటూళ్లలోను, పట్టణములలోను ఏర్పర్చవలెను.

(3) గ్రామరాజ్య కార్యకర్తలూ, సంఘ సభ్యులూ తమ తమ ఆస్తులను, శ్రమ సమయములను, కొద్దో - గొప్పో- పూర్తిగానో గ్రామపరం చేయవలెను. దీనితో వారి నైతిక ప్రతిష్ఠ పెరుగుతుంది. అప్పుడు వారు తమ గ్రామములో ఇంటింటికి పదే పదే సార్లు వెళ్లి సంభాషణల ద్వారా గ్రామ రాజ్యంగురించి నచ్చచెప్పుచూ భూ, సంపత్తి, శ్రమ, సహాయ, బుద్ధి దానములను సేకరించుచు ఈ దిగువ పట్టీలో చేర్చవలెను.

| వ్యక్తి పేరు | భూ దానం | సంపత్తి దానం | శ్రమ దానం (సమయం) | బుద్ధి దానం (విధానం) |
|---|---|---|---|---|
| | | | | |

దానములిచ్చు దాతలను చేరుస్తూ, గ్రామ సంఘమును విస్తృత పరచ వలెను. నేటి పేదలు కూడా శ్రమదానమును, కొద్దిగానైనా సంపత్తి దానమునుఇచ్చి దాతలుగా గ్రామరాజ్య స్థాపనకు తోడ్పడగలరు. గ్రామరాజ్యము ప్రజలందరికి సంబంధించినది. అందుచేత పల్లెలు, పట్టణములు అను తేడా లేనట్లే, బీదా సాదా భేదం లేకుండ అందరూ గ్రామరాజ్య స్థాపనలో పాల్గొనవలెను. గ్రామస్థులందరూ దాతలై సంఘ సభ్యులగుటకు గ్రామసంఘం ఎప్పటికప్పుడు కృషి చేయవలెను

(4) పై పట్టికలో చేరిన దానములన్నీ గ్రామ సమిష్టి సంపద. వీటిలోని శ్రమ, సమయ, బుద్ధి దానములనూ, భూ సంపత్తి దానములను జోడించి, అధికాహారోత్పత్తి, గ్రామపరిశ్రమలు, పారిశుద్ధ్యము, ప్రయోజన విద్య, వైద్యము, మార్గసౌకర్యము వంటి గ్రామోపయోగ కార్యక్రమములకు గ్రామస్థుల సహాయంతో గ్రామ సంఘం పూనుకొనవలెను.

(5) గ్రామ జనాభా, వసతులు, ఎగుమతులు, దిగుమతుల వివరములు సేకరించి, గ్రామమును గ్రామరాజ్య విధానములో నడిపించుటకు ఏమేమి చేయవలెనో గ్రామ సంఘం ఇచ్చటి నుంచి ప్లానులను వేయవలెను.

6) గ్రామసంఘం చుట్టుప్రక్కల గ్రామాలతో సంబంధం పెట్టుకొని, అక్కడ కూడ గ్రామసంఘముల అభివృద్ధిని ప్రోత్సహించుట చేత, జనశక్తి బలపడి ఫిర్కాలు, జిల్లా సంఘముల నిర్మాణమునకు తోడ్పడును.

(7) విద్య, వైద్య, న్యాయములు గ్రామములోనే లభింప చేయవలెను. అప్పుడు పట్టణముల నుండి మేధావులు

గ్రామములకు వస్తాయి. పట్టణములలో ఒత్తిడి తగ్గుతుంది. గ్రామములకు అభివృద్ధి వస్తుంది. ఈ కార్యమందు పల్లెలలోని సంఘములు, పట్టణములలోని సంఘములు సహకరించు కొనవలెను.

(8) ఆర్థికంగా గ్రామాలను సాధ్యమైనంతవరకు స్వయంపోషకం చేయుటకుగాను, వస్తుమార్పిడికి, సహాయమునకు తప్ప, గ్రామము నుండి ఎగుమతులను ఆపివేయవలెను. గ్రామ ఫలసాయమును గ్రామస్థులందరూ ముందు అనుభవించవలెను కదా. ఇట్లే గ్రామపరిశ్రమల ద్వారా తయారు చేయలేని వస్తువులను తప్ప, ఇతర సామానుల దిగుమతిని నిలిపివేయవలెను. ఈ దశయందు గ్రామస్థులు సంఘదృష్టితో కొన్ని విలాసములను త్యాగము చేయవలసి యుండును.

(9) పై కార్యక్రమముల వల్ల గ్రామములు వృద్ధిపొంది, ఈనాటి ప్రభుత్వం చేయు పనులు చాలా భాగం గ్రామ సంఘాలే నెరవేర్చుకొనుచుండును. అందుచేత నేడు గ్రామము చెల్లించు పన్నులలో ఎంత భాగము మార్గములు మొదలగు సమిష్టి సౌకర్యములకు బైటకు చెల్లించవలెనో, ఎంత భాగము గ్రామములోనే ఉంచుకొనవలెనో నిర్ణయించుకొనవలెను.

(10) అంతకంతకు ఆస్తి అంతా గ్రామపరం అయిపోయి, నేటి ఆర్థిక, రాజకీయ, వ్యవస్థలకు ప్రత్యామ్నాయముగా గ్రామరాజ్యం ఏర్పడును. గడ్డు సమస్యలనుకూడ ప్రబోధము, జనశక్తి పరిష్కరించగలవు. ఇంకా మిగిలిపోతే ఆఖరి సాధనంగా సత్యాగ్రహమును అవలంబించవచ్చును.



ప్రతులకు :—

‘ ఆర్థిక సమత ’

పటమట :: కృష్ణాజిల్లా



ముద్రణ :—

సొసైటీ ప్రింటర్స్,

పటమట.